

గ్లాస్ మౌల్డ్ మిషన్ వద్ద శిశిర్ సహానా (1999)

# మిసిమి

**"All that we are is the product of what we have thought" is "We are what we think." - Dammapada.**

సంపుటి 11 జులై 1999 సంచిక 7

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ రవీంద్రనాథ్ ఆలపాటి

## విషయసూచిక



విడిప్రతి రూ. 8/- వార్షిక చందా రూ. 100/- విదేశీయులకు $ 20

ముఖచిత్రం : 'లివింగ్ ఇన్ ది ఏజ్' మౌల్డెడ్ గ్లాస్ (1998) శిశిర్ సహానా చిత్ర - శిల్పాలు

Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.,
1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7645536
e-mail : misimi_m@hotmail.com
http : //www.misimi.com

సంపాదకుడు : అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి

QUIZ

# What the doctor ordered

**You don't have to be a hypochondriac or the strongly suffering type to suffer through this quiz. So just go ahead and plumb the depths of your medical knowledge**

**Questions**

*1. How did the word 'doctor originate?*

*2. Who wrote the following lines- The best doctors in the world are Doctor Diet, Doctor Quiet and Doctor Merryman?*

*3. Who is a spin doctor?*

*4. Which medical doctor invented which deadly weapon?*

*5. In History, who is known as the 'Seraphic Doctor'?*

*6. What do you mean by the term 'Doctor Shopping'?*

*7. Who is 'Doctor Death'?*

*8. Which animal is popularly known as the 'Doctor of the Arabs'?*

*9. Which famous doctor said, "I do not ask either your opinions or your religion, but what is your suffering"?*

*10. What is a 'doctor's neck'?*

*11. Which American tennis player is nick-named 'Doctor Dirt'?*

*12. Apart from being a medical man, who is a 'company doctor'?*

*13. Who is called a 'dope doctor'?*

*14. Who are referred to as 'witch doctors'?*

*15. Who wrote the following books:*

*a) 'The Doctor's Dilemma*

*b) Doctor Jeckyll and Mr Hyde*

*c) Doctor Zhivago*

*16. What is a horse doctor called?*

**Answers**

1 Doctor is Latin word meaning a teacher, and is derived from *docere*, meaning to teach.

2. Jonathan Swift.

3 In the jargon of US politics, he is a senior political spokesperson employed to promote a favourable interpretation of events to journalists

4. Dr Richard Gatling invented a machine gun that fired up to 600 rounds a minute in 1862

5. St. Bonaventura.

6.It is a psychogenic disorder in which the patient repeatedly changes his physician.

7. Dr. Je Kevorkian, inventor of the suicide machine.

8. The Arabian Orix.

9. Louis Pasteur.

10. A condition where two round are as of the neck muscle swell because of prolonged use of the stethoscope.

11. Tim Wilkinson.

12. A person who specialises in turning an ailing company into a profitable one.

13. One who prescribes brandy as a remedy for all diseases.

14. People who profess to have the power to detect witches and cure a bewitched person. They also claim to be able to perform superhuman tasks.

15. a) George Bernard Shaw

b) Robert Louis Stevenson

c) Boris Pasternak

16. Farrier.

**- Ehtesham Anjum.**

# సాహస చిత్రశిల్పి శిశిర్ సహానా !

– చలసాని ప్రసాదరావు

''ప్రదర్శనార్థం 1996లో రూపొందించిన ఒక చిత్ర - శిల్ప పరంపరలో భాగమైన ఈ విశిష్ట కళారూపం అసాధారణమైనది గాజును కరిగించి, తన ఆలోచన కనుగుణమైన ఆకృతులలోకి మలుచుకుంటూనే, రంగుల్ని భావస్ఫోరకంగా మేళవించి సృష్టించిన ఈ కళాఖండాలు ఇటు భావసారూప్యంలో సాంప్రదాయిక భారతీయ దేవాలయ కళను గుర్తుకు తెస్తూనే, గ్లాస్‌ను తన కళా సృష్టికి వినియోగించుకున్న తీరు సమకాలీన కళలోని అత్యంతాధునికతనూ ప్రదర్శిస్తాయి ''

1997 లో లండన్‌లో వెలువడిన ''అర్కిటెక్చరల్‌గ్లాస్ ఆర్ట్'' అనే గ్రంథంలో కళానిమర్శకుడు అండ్రీ మూర్, భారతీయ యువ చిత్రకారుడు శిశిర్‌సహానా చిత్ర- శిల్పాలను గురించి రాసిన పరిచయ వాక్యాలివి నా అనువాదం అంత నిర్దుష్టమైనదేం కానందున, ఆయన ఆ చిత్ర శిల్పాన్ని చూసి పారవశ్యంతో రాసిన ఈ మాటలలోని భావం మరింత బలంగా వెల్లడయి ఉండకపోవచ్చును

ఈ ప్రసంశపొందే నాటికి శిశిర్‌సహానా 34 ఏళ్లవాడు పశ్చిమ బెంగాల్‌లోని బంకూరాలో జన్మించిన ఈ కళాజీవి గత పదేళ్లుగా హైదరాబాద్‌లో నివశిస్తున్నాడు 1987లో బేచలర్ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్, 1989లో మాస్టర్ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్ డిగ్రీల్ని విఖ్యాత సాంప్రదాయిక కళాశాల శాంతి నికేతన్ నుండి పొందాడు. అంటే మొత్తం ఏడేళ్ల చిత్ర కళలో క్రమ బద్ధ శిక్షణ పొందినట్లు. ఆ సమయంలో అతని ఆలోచన శిల్పంలో ఆధునిక ప్రయోగాలపైకి ప్రసరించింది. ఎవరూ తొక్కని దారికోసం అన్వేషణ అతనిలో అప్పటికే ఆరంభమయి ఉంది. వాస్తవానికి ఆ దృష్టి, తపన, అందుకు తగిన కృషి లేని వారెవరూ చిత్ర కళారంగంలో తమ వ్యక్తిత్వాన్ని ప్రదర్శించలేరు. నిలద్రొక్కుకోలేరు.

గ్లాస్ మీద రంగులు వేసి రూపాల్ని సృష్టించటం ఒకరకం. రంగు రంగుల గ్లాస్ ముక్కల్ని కావలసిన ఆకారాల్లోకి కట్ చేసుకుని ఆకృతులను పేర్చటం ఒక రకం. ఇలాంటివి మన దేశంలో చర్చీలలో కొన్నింట కనపడుతుంటాయి. ఇవన్నీ ఏనాటినుండో నలుగురికీ తెలిసినవే.

గాజును విపరీతమైన వేడిలో కరగబెట్టి ($900^0$సెంటిగ్రేడ్‌లో) ఆ కరిగే గాజు ద్రవాన్ని కోరుకున్న ఆకృతిలోకి తెచ్చుకుంటూ, అదే సమయంలో రంగులు కూడా కావలసిన విధంగా ఆగ్లాస్‌లో సహజంగా మిళితమై పోయేలా చూడటం ఈ ప్రక్రియలోని ప్రధాన సూత్రం సాంకేతికంగా ఇదెంత క్లిష్టమూ, కష్టతరమూ అయినదో కళాకారుడు పడవలసిన శ్రమ, వెచ్చించవలసిన కాలమూ, ధనమూ కూడా అంతే అధికం.

ఒక ముఖ్యాంశం ఏమంటే భారతదేశంలో గతంలో అన్ని కళలూ అభివృద్ధి చెందాయి గానీ గాజును తయారు చేయటం గానీ, గాజుతో వస్తువులను తయరు చేయటం గానీ లేదనుకుంటాను

కావ్యాలలో, ఇతిహాసాలలో వర్ణించిన నాయికలు ప్రతిబింబాలు చూసుకునే అద్దాలు ''గ్లాస్''తో తయారయినవేనా అనే అనుమానం వస్తున్నప్పటికీ, నిపుణులు చెప్పటం మాత్రం మన దేశంలోకి గ్లాస్ పాశ్చాత్యుల నుండే వచ్చిందని. ''బెల్జియం గ్లాస్'' అనే మాట శతాబ్దాల సంగతేమోగానీ దశాబ్దాలుగా మనందరికి సుపరిచితమైన మాట!

అలాంటి ''గ్లాస్'' కళా ప్రక్రియలో తన జెండా ఎగుర వేయాలనుకున్నాడు మూడు పదుల వయసుకు చేరుకుంటున్న దశలోని శిశిర్‌సహానా. అతను అప్పటికే అసంఖ్యాకంగా ''పెయింటింగ్స్'' వేసి ఉన్నాడు. వాటిని దేశంలోని ముఖ్య ప్రాంతాల్లో ప్రదర్శించటమూ జరిగింది. వాటిలో ప్రతిఫలించే ప్రత్యేకలక్షణాలకు గుర్తింపుగా ప్రసంశలనూ అందుకున్నాడు. ''ఇతివృత్తం'' దృష్ట్యా ఆయా చిత్రాలలో చూసేవారిని బట్టి స్పష్టాస్పష్టంగా ప్రతిఫలించే ఆధ్యాత్మిక గంభీరత, గతంలోకి తీసుకు వెళ్లే చిత్రితాంశాలు, అందుకు తగిన రంగుల సమ్మేళనం కనుపిస్తాయి

ఇవన్నీ అతని కళా సృష్టిలోని తొలినాళ్లనుండి వికసిస్తూ వచ్చి పరిపక్వతనందుకున్నవే. ఇప్పటికీ ఆదారిలో ఆయన కళాసృష్టి కొనసాగుతూనే ఉంది. అయితే, శిశిర్ సహానా ''గ్లాస్ ఆర్ట్'' ప్రక్రియలో చేసిన ప్రయోగం విశిష్టమైనది. అటువంటి ప్రయోగం మన దేశంలో ఇంకెవరన్నా చేశారా? అనేది అనుమానమే! కొయ్యలో శిల్పాలు చెక్కారు. లోహంతో శిల్పాలు అచ్చుపోశారు. రాతిలో మలిచారు. మట్టితో రూపొందిన వాటి సంగతి సరేసరి.

మన దేశంలోని కొన్ని మ్యూజియంలలో గాజుతో చేసిన కళాత్మక వస్తువు లెన్నెన్నో ఉన్నాయి. అయితే అవన్నీ విదేశాలనుండి బ్రిటిష్ వారి కాలంలో మన రాజులు, మహారాజులు సేకరించుకున్నవే తప్ప ఇక్కడ తయారయినవి గావు. అదీ గాక అవన్నీ ''వస్తువులు''. కొన్ని కొన్ని ఉపయోగాల కోసం తయారుచేసినవి తప్ప ప్రత్యేకించి శిల్పాలుగా, అందునా గాజులోనే రంగులు కలగలసి పోతూ కావలసిన ఆకారాన్నిచ్చే విధంగా రూపొందించినవి కావు.

ఆ ప్రక్రియలో కృషిచేసి, విజయం సాధించటమే గాదు, అందులో అవిరళ కృషి చేసిన పాశ్చాత్యుల నుండి ప్రసంశల నందు కున్నాడు శిశిర్ సహానా! దీన్ని సాధించటం కోసమే అతను హైదరాబాద్ పబ్లిక్ స్కూల్‌లో అప్పటికి నాలుగేళ్లుగా తాను చేస్తున్న ఆర్ట్ టీచర్ ఉద్యోగాన్ని వదలి వేసి లండన్ వెళ్లాడు. అక్కడి సెయింట్ మార్టిన్స్ కాలేజ్ ఆఫ్ ఆర్ట్ అండ్ డిజైన్‌లో ప్రత్యేక శిక్షణ పొందాడు. దీనినే వారి పరిభాషలో ''అడ్వాన్స్ డిప్లోమా ఇన్ స్టెయినెడ్ గ్లాస్ పెయింటింగ్'' అన్నారు. మన దేశానికి తిరిగి వచ్చిన తరువాత మరలా ఏ ఉద్యోగంలోనూ చేరకుండా తన పూర్తి కాలాన్ని చిత్ర కళకే, ముఖ్యంగా ''స్టెయినెడ్ గ్లాస్ పెయింటింగ్''కే అంకితం చేస్తున్నాడు. ఈ మాటకు క్లుప్తంగా తెలుగు మాట ఎన్నిక చేయటం కష్టం.

చిత్రకారుని మదిలోని భావాన్నతడు కాగితంపైనో, క్లాత్‌కాన్వాస్ పైనో రంగుల్లో పెడతాడు. దాన్ని మోడల్ డ్రాయింగ్‌గా ఉంచుకుని మట్టితో త్రీడైమెన్షనల్ చిత్రం..... అంటే శిల్పం రూపొందిస్తాడు. మళ్లీ దాని సాయంతో సిరమిక్ లేదా ప్లాస్టర్ మౌల్డ్‌ను తయారు చేసుకుంటాడు. ఇపుడా మౌల్డ్‌లోంచే గాజుతో శిల్పాన్ని రాబట్టవలసి ఉంది

అందుకోసం విపరీతమైన వేడిలో కరిగించిన గాజు ద్రవాన్ని ఆమౌల్డ్‌లోకి పంపాలి అది గడ్డ కట్టుకునేలోగా చిత్ర- శిల్పి తనకు కావలసిన రంగుల్ని కోరుకున్న ఆకృతులలో ఆగ్లాస్‌లో కలగలసిపోయి ప్రతి ఫలించేలా అత్యంత వేగంగా పనిచేయవలసి ఉంటుంది

మనం చూసే శిల్పాలు, కంచు విగ్రహాలు తయారు చేసే క్రమం కూడా దాదాపు ఇదే అయితే, వాటికి రంగులు ఉండవు ఈ గాజు శిల్పంలో రంగులు కూడా దాన్లో విడదీయరాని భాగంగా కలిసిపోయి ఉంటాయే తప్ప, పైపై మెరుగులు కావు

ఈ విధానంలో తనదైన ''సబ్జెక్ట్స్''ను ప్రతిభావంతంగా సృష్టించగలిగాడు శిశిర్ సహానా!

ఇవెంత కష్టతర, క్లిష్ట ప్రయోగాలో, అంతే ఖరీదయినవి. మళ్లీ నీటిని పదిమంది దృష్టిలోకి తేవటం అనేది కూడా కష్టమైన పనే! సాధారణ శిల్పంలాగే అన్ని వైపుల నుండి చూసే, చూడదగిన ''త్రీడైమెన్షనల్' వి గనుక ఏమాత్రం దెబ్బతిన్నా కళాకారుని శ్రమ అంతా వృధాయే.

అయినా వెనుకాడ కుండా ఆ ప్రక్రియనే తనదిగా చేసుకున్నాడు శిశిర్ సహానా!

ప్రతిభావంతుడైన ''పెయింటర్'' అయి ఉండి కూడా అతిక్లిష్ట ప్రక్రియ అయిన ''గ్లాస్''ను తన ''కాన్వాస్''గా ఎన్నుకున్న ఈ చిత్ర - శిల్పి గురించి 1994లో లండన్‌లో ''ప్రయోగాత్మక గ్లాస్ కళాధ్యయన వర్క్‌షాప్'' కు ఆధ్యాపకునిగా వచ్చిన ఆస్ట్రేలియన్ కళాకారుడు, 'గ్లాస్'లో తన విశిష్ట ప్రయోగాలకు అంతర్జాతీయ ఖ్యాతి నందుకుని ఉన్న విఖ్యాతుడు క్లాస్ జిమ్మర్ ఇలా ప్రసంశించాడు:

''నేను చూసిన శిశిర్ సహానా గ్లాస్ పెయింటింగ్స్‌లో కొన్ని నేను గతంలో ఎక్కడా చూసి ఉండని అసాధారణ కళా నైపుణ్యంతో నన్ను చకితుణ్ణి చేశాయి. అతనిలో సృజనాత్మక ప్రతిభ వెల్లువై ప్రవహిస్తోందనుపించింది'' అని.

ఇంతకు మించిన ప్రసంశ, ఒక ప్రక్రియలో అంతర్జాతీయ ఖ్యాతి నందిన శిల్పినుండి మరో చిత్ర శిల్పికి అందునా భారతీయునికి అందటం విశేషమే. ఇంతా చేసి శిశిర్ సహానా ముప్పయార్లేళ్లవాడు. మరెంతో కళాజీవితం ఉందతని ముందు. అది మరింత ఉజ్వలంగా ఉండక తప్పదు.

# రచయిత - శిల్పము

## (1957 నోబెల్ పురస్కార స్వీకారోపన్యాసం)

మూలం: ఆల్బర్ట్ కామూ                    అనువాదము : డా. యు. ఎ. నరసింహమూర్తి

స్వచ్ఛంద సంస్థ అయిన మీ స్వీడిష్ అకాడమీ నన్ను పరమోదారంగా సత్కరించింది. సర్వశ్రేష్ఠమైన ఈ పురస్కారాన్ని అంతులేని కృతజ్ఞతాభావంతో స్వీకరిస్తున్నాను. ముఖ్యంగా నా వ్యక్తిగత ప్రజ్ఞాపాటవాలకంటె, నా సాహిత్య సేవకు మీరందించే ఈ పురస్కారం ఎంత అతీతమైనదో నేను గుర్తించినప్పుడు ఆ కృతజ్ఞత ఇంకా ప్రగాఢమౌతుంది. ప్రతి మనిషి, ప్రతి కళాకారుడు గుర్తింపును కోరుకుంటాడు. అందుకు బలమైన కారణాలుంటాయి. నేను అలా గుర్తింపును కోరుకునేవాణ్ణే. నిజానికి నేనేమిటి? నాకీ పురస్కారాన్నిస్తే వచ్చే అనంతర పరిణామాలేమిటి? అని బేరీజు వేసుకొని మీ ఈ నిర్ణయాన్ని నేను అవగతం చేసుకోలేకపోతున్నాను. నేనింకా యువకుణ్ణి. కేవలం సందేహ సంపన్నుణ్ణి. నా వ్యాసంగం ఇంకా కొనసాగుతూనే ఉంది. రచనలో, స్నేహాతిరోగమనాలలో ఏకాంతవాసానికి అలవాటు పడ్డవాణ్ణి. ఒంటరిగా, నాకు నేనుగా మిగిలిన తరుణంలో హఠాత్తుగా నన్ను వెళ్ళి మిరుమిట్లు గొల్పే కాంతిపుంజ కేంద్రకం కింద చేర్చిన వార్త నా గుండెలవిసిపోయేలా చేసింది. ఐరోపాలోని సమకాలీన మహోదాత్త రచయితలనెందరినో ఉపేక్షించిన ఈ పురస్కారాన్ని ఇప్పుడు నేనెలాంటి మనోభావాలతో స్వీకరించగలను? నా మాతృదేశం దురంతదైన్యంలో మునిగి వున్న సంకట స్థితిలో నేనీ పురస్కారాన్ని ఎలా అంగీకరించగలను?

ఆ అఘాతాన్ని, అంతర్మథనాన్ని నేను అనుభవించేను. మహోదారమైన ఈ అదృష్టంతో సమాధానపడడానికి, సూటిగా చెప్పాలంటే తిరిగి మనశ్శాంతి పొందడానికి, సాహిత్య కళమీద నా అవగాహన, రచయితగా నా పాత్ర - జీవితమంతా, అత్యంత విరుద్ధ సన్నివేశాలలో కూడా నాకు బాసటగా నిలిచేయి. నాకు చేయూతనిచ్చినదింకొకటి ఏదీలేదు. అందుచేత కేవలం ఈ పురస్కారం మీద ఒరిగి, ఆనందోత్సవాలలో కాలంపుచ్చలేను. ఈ ఊహ ఏమిటో కృతజ్ఞతతో స్నేహపూర్వకంగా నేను చెప్పగలిగినంత తేలికగా నన్ను చెప్పనీయండి.

నా కళలేనిదే నేను బ్రతుకలేను. కాని అది అన్ని విషయాలకంటె గొప్పదని నేనెప్పుడూ అనుకోలేదు. అలా అయినా అది నాకు కావాలి. నా సహచర మానవుల నుండి దానిని వేరు చెయ్యడం సాధ్యంకాదు. అందుకే అది కావాలి. అది నన్ను నన్నుగా జీవించనిస్తుంది. ఒకప్పుడు వారితో కలిసి జీవించనిస్తుంది. వారిసొత్తైన, జీవన సహజమైన సుఖ దుఃఖాలతో నిండిన చిత్రాన్ని వారికి అందించి అసంఖ్యాక ప్రజానీకాన్ని స్పందింపజేసే సాధనమది. కళాకారుడు అంటీముట్టనట్టుండకుండా ఒప్పుకునేలా చేస్తుంది కళ. అత్యంతవినీతము, అత్యంత సార్వజనీనము అయిన సత్యానికి అతన్ని కట్టి పడేస్తుంది. తరచుగా, తన నుదుటి రాతలో కళాకారుణ్ణే వెతుక్కున్న ప్రతీవాడూ తనను ఇతరుల కంటె వేరైనవానిగా అనుకుంటాడు. కాని త్వరలోనే తానూ అందరితోటివాడినే అని ఒప్పుకోకపోతే తన కళను గాని,

ప్రత్యేకతను గాని కొనసాగించలేనని అతనికి తెలిసివస్తుంది. కళాకారుడు తన ఉత్కృష్టమైన సౌందర్యానికి, తాను దూరంకాలేని సమాజానికి మధ్యలో ఇతరుల కోసం తనను తాను మలుచుకుంటాడు. అందుకే కళాకారులు దేనితోనూ తృప్తిపడరు. అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తుంటారు గానీ, తీర్పు నివ్వడానికి తలపడరు. ఒకవేళ ఎప్పుడైనా ఈ లోకంలో సత్యాసత్యం చూపాల్సివస్తే, వాళ్లు నివసించే సమాజం పక్షాన మాత్రమే వారు నిలుస్తారనుకుంటాను. 'ఒక కార్మికుడు (కళాకారుడు) ఒక సేవకుడు కావచ్చు, ప్రశ్నలు మాత్రమే పాలిస్తారు, న్యాయాధిపతి కాదు' అన్న నీషే సూక్తులు ఈ సత్యాన్ని చెప్తాయి.

రచయిత పాత్ర కష్టాలబండిని భుజానికెత్తుకోకుండా నడచేది కాదు. ఇంకా వివరించాలంటే - రచయిత ఈనాడు చారిత్రక పురుషుల జాబితాలో తనపేరు చేర్చుకోలేడు. రచయిత చరిత్రకోసం బాధలు పడ్డవారి సేవలోనే ఉంటాడు. అలా కానినాడు అతడు ఒంటరి ఔతాడు, తన కళ నుండి దూరమౌతాడు. అడుగులో అడుగై అందరినీ ఆకట్టుకునేలా నడిస్తే తప్ప, కోట్లాది సైనికులతో నిండిన క్రూరసైన్యాలన్నీ ఏకమైనా రచయితను తన ఏకాంతం నుండి విముక్తం చేయలేవు. కాని రచయితను తన ప్రవాసం నుండి బయటకు రప్పించడానికి అవమానాలతో, దిక్కులు పడ్డచోటకు నిర్వాసితుడైన ఒక్క అజ్ఞాతఖైదీ మౌనం చాలు. కనీసం ఎప్పుడు స్వేచ్ఛా పథాలలోని హక్కుల మధ్య మసలుతాడో అప్పుడు ఆ మౌనాన్ని విస్మరించకుండా ఉంటాడు. ఆ మౌనాన్ని తన కళాజగత్తు ప్రతిధ్వనించేలా ప్రసారం చేస్తాడు.

ఆ కార్యసాధనకు తగిన గొప్పతనం మనలో ఏ ఒక్కరికీ లేదు. అగమ్యపథాలలోను, తాత్కాలిక పేరు ప్రతిష్ఠలలోను, క్రౌర్యపు ఇనుపముసలలోను, వాక్స్వాతంత్ర్యం లభించిన వేళలలోను - ఇలా అన్ని జీవన సన్నివేశాలలోను రచయిత తన శక్తిమేరకు తన శిల్పప్రౌఢిని సంఘటించే - సత్యశోధన, స్వేచ్ఛాసాధన అనే రెండు మహత్తర కార్యాలకు కట్టుబడి ఉండేందుకు అంగీకరిస్తే సమకాలీన సమాజాన్ని కైవసం చేసుకోగలడు. దాని మనసుగెలుచుకోగలడు. ఆ సమాజం అతన్ని సమర్థిస్తుంది. ఎంత వీలైతే అంత అధిక సంఖ్యలో ప్రజల్ని సమైక్య పరచడం రచయిత విధి. తను మాట చెల్లిన చోటల్లా ఏకాంతాన్ని సృష్టించే అబద్ధాలతోను దాస్యంతోను అతని కళ ఎప్పుడూ రాజీపడనే కూడదు. వ్యక్తిగత బలహీనతలెన్నైనా ఉండవచ్చును. కాని రచయిత ఎన్నడూ తనకు తెలిసిన దానిని గూర్చి అబద్ధాలు చెప్పకూడదు. అణచివేతను ఎదిరించాలి. ఈ రెండూ చాలా కష్టమైన పనులు. కాని వీటికి కట్టుబడి ఉండడం మీదే రచయిత శిల్పసౌష్ఠవం వేళ్లూనుకుని ఉంటుంది.

ఇరవై ఏళ్లకు పైబడ్డ ఉన్మత్త చరిత్రలో, కాళ్లూచేతులా తన్నుకుంటూన్న కాలంలో నాతరంలోని ప్రజలందరిలాగే, నిశ్శేషంగా అంతా పోగొట్టుకున్న నాకు బాసటగా నిలిచిన దొకటే. అది రచన అనే నాలోని నిగూఢ చింతన. అది ఒక నిబద్ధత కల చర్య. కాబట్టే ఈ రోజు నేను మీ ముందు గౌరవంగా నిలుచున్నాను. కేవలం రాయాలనే నిబద్ధత మాత్రమే కాదు అది ఒక విశిష్టమైన నిబద్ధత నా రచనాశక్తిని, నా ఉనికిని దృష్టిలో పెట్టుకుని సమకాలీన చరిత్రలో నాతో నివసిస్తున్న వారందరితో కలిసి, మేమంతా

పంచుకున్న ధైర్యాన్ని - ఆశను గూర్చి రచించే నిబద్ధత ఈ ప్రజలంతా మొదటి ప్రపంచయుద్ధం ప్రారంభమైన రోజుల్లో పుట్టినవారు. హిట్లరు పరిపాలనకు ఎచ్చి, తిరుగుబాటు దారుల మొదటి విచారణలు ప్రారంభమయ్యే నాటికి వీళ్ళంతా ఇరవైయ్యేసేళ్ళవాళ్లు, వాళ్ళంతా తమ చదువు పూర్తయేటప్పటికి స్పెయిన్ అంతర్యుద్ధం, రెండవ ప్రపంచ యుద్ధం, హిట్లరు యుద్ధ ఖైదీల జైళ్లు (Concentration Camps) వీటన్నిటితో ఒకహింసగా, 'జైలుగా మారిన ఐరోపాలో' తలపడవలసి వచ్చింది. ఈ మనుషులే ఇప్పుడు అణు వినాశన భయంతో గడగడలాడుతున్న లోకంలో తమ పిల్లలను పెంచి, వాళ్లకు ఉపాధులను కల్పించవలసిన అవసరం ఏర్పడింది. వాళ్లను ఆశావాదులుగా ఉండుమని అడిగే దమ్ము ఎవరికీ లేదనుకుంటాను. దానితో పోరాటాన్ని విడవిపెట్టకుండానే మనం అంతులేని నిరాశతో ఈ లోకాన్ని తృణీకరించే హక్కును కూర్చుకుని ఈ యుగ లక్షణమైన నిరాశావాదంలోకి పరుగులు తీస్తున్న వారి తప్పునుకూడా అర్థం చేసుకోవాలి నా దేశంలోను, ఐరోపాలోను మన మనేకులం ఈ నిరాశావాదాన్ని తిరస్కరిస్తున్నాము. ఇది వాస్తవం మనం క్రమబద్ధతను సాధించే పరిశోధనలో నిమగ్నులమై ఉన్నాము. మన చరిత్రలో మరణమృదంగం ఒక సహజాతంగా మ్రోగుతూంది దానిని బహిరంగంగా ఎదిరించి పోరాడే పునర్జన్మకోసం, సర్వనాశనమైన వేళలలో కూడా బతికనేర్పిన కళను వాళ్లు తమంతతాముగా పెంపొందించుకోవాలి.

ప్రతి తరం నిస్సంశయంగా ప్రపంచాన్ని సంస్కరించడం కోసం తమకు పిలుపు వచ్చినట్లు అనుకుంటుంది. ఆ తరం ప్రపంచాన్ని సంస్కరించలేదని నాకు తెలుసు. బహుశా దాని ముందు ఇంకొక మహత్తర కర్తవ్యం ఉంది. ప్రపంచం తనను తాను నిర్మూలించుకోకుండా ఈ తరం అడ్డుపడాలి. కుప్పకూలిన తిరుగుబాట్లు, ఉన్మత్త సాంకేతిక పరిజ్ఞానం, మృతదైవాలు, చీలికలు పేలికలైన సిద్ధాంతాల కలగలుపుతో కలుషితమైన చరిత్ర వారసత్వంలో పుట్టిన తరమిది. నాసిరకం శక్తులు అన్నిటినీ నాశనం చేస్తున్నాయి. కాని తిరిగి సమాధానపరచడం వాటికిప్పటికీ తెలియడం లేదు. మేధ తన విలువను తానే తగ్గించుకుని ద్వేషానికి, అణచివేతకు దాసిగా మారింది. ఇన్ని తప్పుకుపోయే తోవల్లోంచి పుట్టిన తరమిది ఇప్పుడిది ఇంటాబయటా పునర్వ్యవస్థీకరణకు పూనుకోవాలి. ఆ ప్రయత్నం ఈ షణ్మాత్రమైనా జీవనానికి మరణానికి ఒక హుందాతనాన్నిస్తుంది. వేర్పాటు ధోరణితో విహ్వలిస్తూన్న లోకంలో, మన నేరపరిశోధకులు ఒక శాశ్వత మరణ సామ్రాజ్యాన్ని స్థాపించే సాహసాన్ని కొనసాగిస్తూన్న ఈ లోకంలో, కాలానికెదురు నడిచే ఒక ఉన్మత్తజాతిలో - ఈ తరం ఏం చెయ్యాలో దానికి తెలుసు. బానిసత్వాన్ని వదలించి దేశాల మధ్య ఒక శాంతిని పునరుద్ధరించాలి. వైరుధ్యాలను చక్కదిద్దుకుని సరికొత్త కృషిని, సంస్కృతిని రూపొందించాలి. అందరి మధ్యా న్యాయ సమ్మతమైన తోరణద్వారాన్ని పునర్నిర్మించాలి. ఈ ప్రగాఢకర్తవ్యాన్ని నిర్వహించే నిరంతర సామర్థ్యం ఈ తరానికున్నదని అంత నిశ్చయంగా చెప్పలేము. కాని ప్రపంచమంతటా ఈ తరం ఇప్పటికే సత్యము, స్వేచ్ఛ అనే రెండు సవాళ్లకెదురు నిలిచింది. ద్వేషం లేకుండా, అవసరమైతే దాని కోసం ప్రాణత్యాగం చేయడం ఎలాగో కూడా దానికి తెలుసు. ఈ తరం ఎక్కడ కనబడినా, మరీ ముఖ్యంగా తనను తాను త్యాగం చేసుకునే చోట, చెయ్యెత్తి మొక్కాలనిపిస్తుంది. దానిని ప్రోత్సహించాలనిపిస్తుంది. మీరు నాకు

సమర్పించిన ఈ పురస్కారాన్ని, మీ సంపూర్ణ సహమతితో, ఈ తరానికి అందించాలని నేను వాంఛిస్తున్నాను.

రచయిత శిల్పంలోని ఉదాత్తతను రేఖామాత్రంగా వివరించిన ఈ సందర్భంలోనే, అతనిని అతనిదైన అర్థస్థానంలో నిలుపవలసి ఉంది ఇప్పుడు రచయిత రెండు పడవల మీద కాళ్లు పెట్టి ఉన్నాడు సమకాలీనస్థితిని భేదించక తప్పదు; అయినా అది అభేద్యమైనది. అంతటా అన్యాయం నిండి వుంది. అయినా న్యాయంకోసం ప్రగాఢమైన ప్రయత్నం చేయక తప్పదు. తనపని తాను చేసుకు పోవాలి. అయినా అందరికోసం పని చేయాలి అందులో మానావమానాల్ని గూర్చి చూడకూడదు. విషాదం అంతటా నిండి ఉంది, అందులోంచి సౌందర్యాన్ని సాధించాలి ఈ రెండింటి మధ్యనున్న విభాజకరేఖ మీద ఆగిపోకూడదు చరిత్ర వినాశకరమైన ఉద్యమంగా ఉంది, దానికి తలవంచకూడదు. దాని గతిని మార్చేరచనలను సృష్టించే నిమిత్తం చివరకు సర్వస్వాన్ని ధారపొయ్యాలి. అతని సహచరులంతా ఇప్పుడు ఆయుధాలు చేపట్టి ఉన్నారు. వాళ్లతో పంచుకో తగ్గవే తప్ప ఇతరమైన, సాధించదగ్గ కోరికలేమీ రచయితకు లేవు సత్యం దురవగాహమైనది. అది దాగి ఉంటుంది. నూనె పరుగుడు లాంటిది. పట్టుకుంటే జారిపోతుంది. ఎప్పటికప్పుడు దానిని జయిస్తూనే ఉండాలి. స్వేచ్ఛ ప్రమాదకరమైనది. దానిలో పారవశ్యం కలిగించే లక్షణముంది. పరవశుడై జీవించడం కష్టం. ఈ రెండు లక్ష్యాల వేపూ మనం మహాప్రస్థానాన్ని కొనసాగించాలి. ఈ ప్రయత్నంలో బాధల్ని భరించాలి. కృతనిశ్చయంతో సాగాలి. మనకంటె ముందు వైఫల్యాలు నడుస్తూ ఉంటాయి. అయినా ప్రస్థానం ఆగకూడదు. రచయిత ఇప్పుడు మంచి చైతన్యంతో తనను తాను సౌజన్యబోధకుడిగా నిలుపుకునే ధైర్యాన్ని కూర్చుకోవాలి? నా గురించి చెప్పవలసి వస్తే నేనలాంటిరకం కాదు. ఈ సంగతి ఎన్ని సార్లైనా నొక్కిచెప్పగలను. వెలుగును వదులుకునే శక్తి నా కెన్నడూ లేదు. ఉనికిలోని సౌఖ్యాన్ని వీడలేను. నేను పెరిగిన స్వేచ్ఛను వదలి ఉండలేను. ఈ నేలంటుతనం నాలోని ఎన్నో చిన్న చిన్న పొరపాట్లను, పెద్ద దోషాలను వివరించినా, నా రచనా శిల్పాన్ని అర్థం చేసుకోవడంలో నిస్సంశయంగా అది ఎంతో తోడ్పడింది. ఏదో ఒక క్షణమైనా తమవద్దకు తిరిగి వచ్చే స్వేచ్ఛా సౌఖ్యపు జ్ఞాపకంతో లోకం తమకిచ్చిన జీవితాన్ని నిలదొక్కుకునే మూగ ప్రజను అర్థం చేసుకుని, ఇంకొక మాట లేకుండా వారికి దన్నుగా నిలవడానికి అదే నాకు సహకరిస్తుంది.

ఇప్పటికి నేను నేనుగా మీ ముందు నిలిచేను. నాకు, కష్టాలు నిండిన నా రచయితల తెగకు సంబంధించిన పరిమితులు, ఋణాలు ఏమిటో వెల్లడించేను. ఇప్పుడెంతో హాయిగా ఉంది నాకు. నేను సాగిస్తున్న ఈ పోరాటంలో, ఇంకెందరో పాల్గొన్నారు. వాళ్లేమీ లాభం పొందలేదు. మీదు మిక్కిలి దైన్యాన్ని, కఠోరదీక్షలను పొందారు. హాయిగా ఉన్న ఈ క్షణంలో, జంకులేకుండా నేను మీకొక మాట చెప్పదలుచుకున్నాను. ఇది నా ముగింపు మాట. మీరెంతో ఉదారంగా అందించిన ఈ పురస్కారాన్ని వారందరికీ నివాళి సమర్పించే ప్రయత్నంగా స్వీకరిస్తున్నాను. గుండెలోతుల్లోంచి మీకు సమర్పించే ఈ కృతజ్ఞత నాలో నిలిచి పోతుంది. నిజాయితీ కల ప్రతి కళాకారుడు ప్రతిరోజూ తనలో మౌనంగా వల్లించే పురాతన విశ్వసనీయతతో సమానమైన, వ్యక్తిగత కృతజ్ఞతాభావాన్ని మీ అందరిముందూ వెల్లడించుకుంటున్నాను.

ఫ్రెంచి రచయిత ఆల్బర్ట్‌కామూ అంగీకారోపన్యాసానికి ముందుగా రాయల్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ సభ్యుడైన బి. కార్ల్‌గ్రెన్ కామూను గురించి ఇలా మాట్లాడేరు :

''మిస్టర్ కామూ! చరిత్ర - సాహిత్యాలలో విద్యార్థిగా నేను మీ గురించి ప్రసంగిస్తాను. మీ కృషి నైజాన్ని గూర్చి, ప్రాముఖ్యాన్ని గూర్చి తీర్పునిచ్చే దురాశనాకు లేదు. ఆ ధైర్యమూ లేదు. నాకంటె సర్వసమర్థులైన విమర్శకులెందరో తగినంతగా ఇప్పటికే ఆ విషయాన్ని వెల్లడించేరు. కాని తొమ్మిదవ నోబెల్ సాహిత్య పురస్కారాన్ని ఒక ఫ్రెంచి రచయితకు ఇస్తూన్న సంఘటనకు సాక్షీభూతముగా ఉన్నామన్న ప్రగాఢమైన తృప్తిని మేమును పొందుతున్నామని నికరంగా మీకు తెలియజేస్తున్నాను. పాశ్చాత్య సంస్కృతిలో కొన్ని శతాబ్దాలుగా ఫ్రెంచి చైతన్యం అత్యంత బలిష్ఠమైన, అగ్రగామి పాత్రను నిర్వహించింది. అదింకా కొనసాగుతూంది. స్వీడన్లోను, ఇతరదేశాల్లోను మేధావులు ఈ నిజాన్ని విస్మరించరు, మరీ ముఖ్యంగా ఈ రోజుల్లో అనేక దేశాల మేధావులు దానిచేత ఆకర్షింపబడుతున్నారు. ఆరాధిస్తున్నారు, అనుకరిస్తున్నారు. మీ రచనలు ఉన్నతమైనవి. వాటిలోని స్వచ్ఛత - నిర్మలత్వం, వ్యాపకత, అనిర్వచనీయత, మీ భాషలోని సహజమైన 'అనుకరణ సాధ్యంకాని, కళామర్మం - ఇవన్నీ మాకు ఆరాధ్యమైనవే. అందుకే మిమ్మల్ని గుండెలకు హత్తుకుంటున్నాము. అద్భుతమైన ఆ ఫ్రెంచి సంస్కృతికి నికార్సైన వారసులైన మీకు మా వందనాలర్పించుకుంటున్నాము.

## జీవత పరిచయం

ఆల్బర్ట్‌కామూ (1913 - 60) శుద్ధ ఫ్రెంచి సాహిత్య వర్గానికి భిన్నమైన వర్గానికి ప్రతినిధి (Non Metropolition French Literature) ఆయన అల్జీరియాలో పుట్టేడు. 1930 దశకంలోని అల్జీరియా అనుభవాలు అతని ఆలోచనల మీద, రచనల మీద బలమైన ముద్రను వేసేయి. తల్లిదండ్రులు అర్థకార్మిక వర్గానికి చెందినవారు. బలమైన విప్లవవాద ధోరణులకు చెందిన మేధావి వర్గంతో ఆయనకు తొలినుండి సాన్నిహిత్యం ఏర్పడింది. తత్త్వశాస్త్రమంటే అంతులేని అభిరుచి కాని ఆ రంగంలో విశ్వవిద్యాలయ వ్యావృత్తిని కొనసాగించే అదృష్టం అతనికి కలిసిరాలేదు. ఇరవైరెండు సంవత్సరాల వయసులో ఆయన ఫ్రాన్సు చేరుకున్నాడు. అది అతనికి తగ్గకాలం. ఫ్రాన్సు ఆక్రమణకాలంలో కామూ నిరోధకోద్యమంలో చేరేడు. విముక్తిలభించేక Combat అనే పత్రికలో కాలమిస్టుగా పనిచేసేడు. ఆయనపాత్రికేయ కార్యకలాపాలన్నీ ప్రధానంగా ఆరోజుల్లోని అవసరానికి తగ్గ ప్రతి స్పందనలే 1947లో కామూ రాజకీయ - పాత్రికేయ రంగం నుండి నిష్క్రమించేడు. కాల్పనిక సాహిత్య రచనకు, వ్యాసరచనకు పూనుకున్నాడు. దానితో పాటు నాటక రచన, నిర్వహణలలో చాలా ఆసక్తితో పాల్గొన్నాడు. (Caligula 1944.) కాల్డరాన్, లోప్ - డి - వేగా, డినోబుజ్జాతి వంటి వారి రచనలతో పాటు ఫాక్‌నర్ రచించిన 'Requiem for a Nun' ను కూడా రంగస్థలానికెక్కించేడు. L 'Equipe అనే అల్జీరియన్ నాటకసంస్థలో సభ్యుడిగా ఉన్న కాలం నుండి కామూకు నాటకరంగం పైకల అభిమానం కనిపిస్తుంది. ఆ సంస్థ సామూహిక సృష్టి 'Revolte Dansles Asturics' (1943) ను ప్రభుత్వం రాజకీయ కారణాల వల్ల నిషేధించింది.

'The Myth of Sisphus' అనే వ్యాసం కామూ అసంగత సిద్ధాంతాన్ని వెల్లడిస్తుంది. అసంగత సిద్ధాంతంలో ఆశకు చోటు లేనేలేదు నిరాశతో అసలు సంబంధమే లేదు. అదొక నిరంతర తిరస్కారం. దానిని సర్వసంగ పరిత్యాగం అని ఉద్దేశపూర్వకమైన అసంతృప్తి అనిమాత్రం అనుకోకూడదు. 'అపరిచితుడు' (The Stranger 1942) అనే నవలలోని మెర్సాల్ట్ అనే ప్రధానపాత్ర కామూ వ్యాసాన్ని బాగా వివరిస్తుంది నిరాశ - ఆశ - ముక్తి అనే ముప్పిరిగొన్న ప్రలోభంలో పడి ఉరితీయబడ్డ ఈ యువ హంతకుని పాత్ర అలవాటు అనే అసంగత సంప్రదాయానికి బలై విసుగెత్తి పోయిన మనిషిని గూర్చి వివరిస్తుంది 'ప్లేగు' (The Plague 1947) అనే నవలలో డా రియాక్స్ ప్రధాన పాత్ర ఒరాన్ నగరంలో ప్లేగు రోగులకు విశ్రాంతి లేకుండా సేవలందించిన ఈ వైద్యుడు అసంగత - అన్యాయ ప్రపంచానికి వ్యతిరేకంగా తిరగబడతాడు ''మానవజాతి పట్ల నిరాశచెందడాన్ని మనం వ్యతిరేకిస్తాం. మానవాళికి సేవ చెయ్యాలనే హేతుబద్ధం కాని బలీయమైన కోరిక ఏమీ లేకుండానే మనమింకా వారికి సేవచేస్తూనే ఉన్నాము'' అన్న కామూ మాటల్ని ఈ వైద్యుడు నొక్కి చెప్తాడు 'పతనం' (The Fall 1956), 'ప్రవాసము - రాజ్యము' (Exile and the Kingdom 1957) అనేవి కామూ ఇతర ప్రసిద్ధ రచనలు. అతని రచనలలో ఒక కొత్త ఐతిహాసిక లక్షణం ఉంది ఒక నైతిక వ్యవస్థ కోసం కొనసాగిన కామూ నియమబద్ధమైన గవేషణ సౌందర్యాంశతో తనకు గల పరస్పర సంబంధాన్ని ఆ ఉన్నత ఐతిహాసిక కళలో నిరూపించుకుంది. అతని శైలిలో ఒక అకళంకమైన స్వచ్ఛత, లక్ష్యశుద్ధి, ఉదారత ఉన్నాయి.

## సమర్పణ

( ఏండర్స్ ఆస్టర్లింగ్, శాశ్వత కార్యదర్శి, స్వీడిష్ అకాడమీ)

ఫ్రెంచి సాహిత్యం ఫ్రాన్సు దేశపు భౌగోళిక సరిహద్దులను దాటి విస్తరించినా అది తన విలక్షణ శీలాన్ని వదులుకోలేదు. ఈ సంవత్సరపు నోబెల్‌సాహిత్య పురస్కార గ్రహీత ఆల్బర్ట్ కామూ ఫ్రెంచి సాహిత్య వికాసానికి ఒక ఉదాహరణ. అల్జీరియా తూర్పు ప్రాంతంలోని ఒక చిన్న పట్టణంలో ఆయన పుట్టేడు. బాల్య, యవ్వన దశలలో తనమీద ముద్రవేసిన నిశ్చిత ప్రభావాలన్నిటికీ మూలాలు వెతుక్కునే నిమిత్తం ఈ ఉత్తర ఆఫ్రికా పరిసరాలలోకి ఆయన తిరిగి వచ్చాడు. ఇప్పటికీ సముద్రాల కవతలనున్న ఈ మహత్తర ఫ్రెంచి భూభాగాన్ని గూర్చి కామూ అనే మానవుడు తెలుసుకుంటూనే ఉన్నాడు. అతనిలోని రచయిత ఈ సత్యాన్ని తరచుగా జ్ఞాపకం చేసుకుని మురిసిపోతూ ఉంటాడు.

అర్థ కార్మిక వ్యవస్థలో కామూ జీవితం మొదలయింది. జీవితంలో ముందుకు పోవాలంటే తన కాళ్లమీద తాను నిలబడక తప్పదని ఆయన తెలుసుకున్నాడు. చాలీచాలని కుటుంబంలో పుట్టిన విద్యార్థి కావడంతో తన అవసరాలకోసం అన్నిరకాల ఉద్యోగాలూ చేసేడు కామూ. రెక్కలు ముక్కలు చేసుకుని విద్యనభ్యసించేడు. వైవిధ్యంతో కూడిన ఆ బోధన అంతా వృధా పోలేదు. అతను వాస్తవికవాది అయ్యేలా చేసింది. అల్జీర్స్ విశ్వవిద్యాలయంలో అతను గడిపిన సంవత్సరాలలో ఒక మేధావి వర్గానికి

అతను సన్నిహితుడయ్యాడు. ఆ వర్గం 'ఉత్తర ఆఫ్రికా నిరోధ' (North African Resistance) లో కీలక పాత్రను నిర్వహించింది. కామూ తొలి రచనలు అల్జీర్స్‌లోని స్థానిక ప్రచురణ సంస్థద్వారా ప్రచురింపబడ్డాయి. ఇరవై ఐదు సంవత్సరాల వయసులో పాత్రికేయుడుగా కామూ ఫ్రాన్సు చేరుకున్నాడు. అతివేగంగా పారిస్‌లో ప్రథమ శ్రేణి రచయితగా పేరుపొందేడు. పెళుసెక్కిన, ఉద్రిక్తమైన యుద్ధపు రోజుల్లోని వాతావరణంలో పరిణత దశకు ముందుగానే చేవెక్కిన రచయిత అయ్యాడు.

ఐహిక జీవనస్పృహకు, తనను కబళించుకుపోయిన మరణ సంబంధమైన చైతన్యానికి మధ్య నడచిన తీక్ష విభేదాలు కామూలో ఆధ్యాత్మిక దృష్టిని ఎలా పెంచాయో అతని తొలి రచనలే తెలియ జేస్తాయి. పట్టపగలింటి ఉజ్జ్వల ప్రపంచవైభవమంతా నీడల మరకల్లో శరణార్థిగా పరుగులు పెట్టడానికే మధ్యధరా తీర కర్మసిద్ధాంతం (Mediterranean 'Fatalism) కంటే ఇది ఎక్కువైనది - మనిషి తనకు తాను స్వతంత్రుడు; ఒంటరి. తన చర్యలకు తానే బాధ్యుడు, తనగమ్యాన్ని తానే ఎంచుకుంటాడు. లోకంతో అతనికేం సంబంధం లేదు. ఇదంతా ఒక అసంగతత్వం - అనే అస్తిత్వవాద ధోరణికి ప్రతినిధిగా కూడా కనిపిస్తాడు కామూ. అసంగతత్వం (Absurd) అనే సాంకేతిక వ్యవహారం కామూ రచనల్లో తరచుగా కనిపిస్తుంది. అతని రచనల్లో ఇది పూసల్లో దారంలా ఉంటుంది. దీనిని అంగిరసం అనవచ్చును. స్వేచ్ఛ, బాధ్యత, దానినుండి వచ్చేవేదన వీటికి సంబంధించిన అన్ని స్థాయిలలోనూ తార్కిక, నైతిక ప్రమాణాలన్నిటిలోకీ ఇది వృద్ధిపొందుతూ ఉంటుంది.

శిశిఫస్ గ్రీకు పురాణగాథ ఒకటుంది. సృష్ట్యాదినుండి శిశిఫస్ ఒక పెద్ద బండరాతిని కొండమీదకు తోసుకుపోతూ ఉంటాడు. ఆ బండ నిరంతరం కిందకు దొర్లుకుంటూ వస్తూ ఉంటుంది. కామూ ఒక వ్యాసంలో దీనిని మానవ జీవనానికి సూక్ష్మసంకేతంగా పేర్కొన్నాడు. అయితే ఆ బండను కొండమీదకు చేర్చే నిరంతర ప్రయత్నమే శిశిఫస్‌కు ఆత్మతృప్తినిస్తుందని, అందుచేత అతడు అంతరంగపులోతుల్లో సుఖిస్తూనే ఉంటాడని కామూ వ్యాఖ్యానించేడు. జీవితం విలువైనదా కాదా అని తెలుసుకోవడం అంత ప్రధానం కాదని, జీవితాన్ని దాని అనుబంధాలైన బాధలతో పాటు ఎలా జీవించాలన్నది ముఖ్యమని కామూ ఆలోచిస్తాడు.

కామూ నిరంతరాకర్షణతో నిండినమేధో పరిణతిని గూర్చి చెప్పడానికి ఈ స్వల్పసమయం చాలదు. ఈ విషయంలో అతని రచనలను సంప్రదించడం ఉపయోగకరంగా ఉంటుంది. సంపూర్ణ ఐతిహాసిక స్వచ్ఛత నిండిన శైలి కామూ రచనలో కనిపిస్తుంది. ఆ రచనలలో ప్రగాఢమైన లక్ష్యశుద్ధి ఉంది. పాత్రలు వాటి చలనాలు అతని ఊహల నన్నింటినీ మన కళ్లముందు నిలుపుతాయి. ఆ మార్గంలో కామూ జీవిత సమస్యల నన్నింటినీ రూపకల్పన చేసేడు. రచయిత వ్యాఖ్యానమేమీ అందులో కనబడదు. అందువల్లనే 'అపరిచితుడు' (The Stranger 1942) ప్రపంచఖ్యాతిని పొందింది. ఇందులోని ప్రధాన పాత్ర ప్రభుత్వ శాఖలోని ఉద్యోగి. అతనొక అరబ్బీ వ్యక్తిని హత్య చేస్తాడు. దాని తరువాత వరుసగా ఎన్నో అసంగత సంఘటనలు జరుగుతాయి. తన దురదృష్టం మీద ఆసక్తి లేకుండానే, తనకు మరణశిక్షపడిందన్న సంగతిని వింటాడు. ఆఖరిక్షణాలలో తనను తాను కూడదీసుకుని నిరుత్సాహపు

సరిహద్దులలోంచి వైరాగ్యంలోకి వెళ్తాడు. 'ప్లేగు' (The Plague 1947) విశాలమైన పరిధి గల ప్రతీకాత్మకమైన నవల డా రియాక్సు, అతని సహాయకుడు ఇందులో ప్రధాన పాత్రలు. ఉత్తర ఆఫ్రికాలోని ఒక నగరంలో వ్యాపించిన ప్లేగు వ్యాధితో ఆ వైద్యుడు వీరోచితంగా పోరాడేడు ఔననిపించే వాస్తవికతతో నిండిన ఈ కథనం ఉత్తర ఆఫ్రికా నిరోధకాలం నాటి జీవితానుభవాల్ని ప్రతిబింబిస్తుంది. ఆశాభంగంతో, కడముట్టా వెనక్కు మళ్లిన మనిషిగుండెల్లో ఆ ఎదురులేని దుష్టశక్తి రెచ్చగొట్టే తిరుగుబాటును కామూ మిన్నుముట్టేలా వర్ణించేడు.

'పతనం' (The Fall 1956) అనే రచన ద్వారా ఇటీవలనే కామూ మనకొక చెప్పుకోదగ్గ ఏకాంత సంభాషణాత్మకమైన కథను అందించేడు. కథాకథనకళపై తనకు గల ప్రభుత్వాన్ని కామూ ఈ రచనలో ఇంకొకసారి ప్రదర్శించేరు. ఒక ఫ్రెంచి న్యాయవాది అమ్స్టర్డామ్‌లోని ఒక నావికుల పానశాలలో అంతర్మథనంతో ఆత్మావలోకం చేసుకోవడం ఇందులోని కథ ఆయన తన చిత్రాన్ని తానే గీసుకుంటాడు. అక్కడున్న అద్దంలో తన సమకాలీనులు కూడా తనతో సమానంగానే ఎవరిని వారు గుర్తుపట్టగలరు. ఈ పుటలలో తార్తూఫ్ (Tartuffe) మానవవ్యతిరేకతతో చేయికలిపిన తీరు ప్రతివారికీ తెలుస్తుంది. సమాజానికి దూరంగా ఉండే ఈ విధమైన మనస్తత్వంలో ఫ్రెంచి ఐతిహాసిక సంస్కృతి సాటిలేనిది. ఇందులో సత్యభీతి నిండిన, దురుసు గుండెగల రచయిత హేళన నిండిన వ్యంగ్యాన్ని, లోకపు కపట వర్తనను ఎదిరించే ఆయుధంగా ఉపయోగించేడు. కీర్క్‌గార్డ్ చెప్పిన, పాతాళగహ్వరంలా అంతటా వ్యాపించిన అపరాధ భావాన్ని గూర్చి కామూ నొక్కి చెప్పడం అందరికీ ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. అయినా రచయిత తన వికాసంలో ఒక మూపును చేరుకున్నాడని ఈ రచన ద్వారా ఎవ్వరైనా భావిస్తారు.

వ్యక్తిగతంగా కామూ నైరాశ్యవాదానికి చాలా దూరంగా ఉంటాడు. కళ్లుమిరుమిట్లు గొలిపే సూర్యకాంతితో తిపసా దగ్గరి మధ్యధరా సముద్రతీరం ఒకప్పుడు తనకు ఆవిష్కరించిన గ్రీకు సమవిభక్త - సౌందర్య లక్షణాలను కామూ ఎప్పుడూ విస్మరించలేదు. సమూలనాశనమైన ఈ లోకాన్ని పునరుద్ధరించే విధిలో విశ్రాంతి లేకుండా నియమనిష్ఠలతో కూడిన ఆలోచనలను కొనసాగించాడు కామూ. అందువల్లనే ఆయన మానవతావాది అయ్యాడు.

చైతన్యంతో, పరిపూర్ణ సృజనశీలంతో కామూ ఫ్రాన్సు బయటనున్న సాహిత్య ప్రపంచంలో కూడా అందరి దృష్టినీ ఆకర్షించేకేంద్రంలో ఉన్నాడు. సత్యసమ్మతమైననైతిక వ్యాసంగంతో ఆకర్షితుడై ఆయన తన సర్వస్వాన్ని మానవ జీవన సంబంధమైన గొప్ప మౌలిక ప్రశ్నలను పరిష్కరించడానికి వినియోగించేడు. నిశ్చయంగా ఈ ఆశయం నోబెల్ సాహిత్య పురస్కారం ఏ ఆదర్శాల కోసం స్థాపించబడిందో ఆ లక్ష్యాల కనుగుణంగా ఉంది. మానవాళి ఉనికి వెనుకనున్న అసంగతత్వం మీద కామూ కుండే నిరంతరాభిముఖ్యం. కేవలం గొడ్డుమోతు వ్యతిరేకవాదం కాదు. ఈ దృష్టితో లోకాన్ని చూడడం వలన కామూలో ఒక బలీయమైన అవశ్యంభావితయైన పరిపూర్ణత ఏర్పడింది. అంతేకాకుండా అసంగతత్వానికి వ్యతిరేకంగా ఒక మానసిక దార్ఢ్యాన్ని ప్రేరేపించింది. ఆ కారణంగా ఒక విలువను సృష్టించింది.

# శాస్త్రజ్ఞులను లంక ఒడ్డుకు చేర్చిన మూలకం

## (Element - 114)

– డా. చాగంటి కృష్ణకుమారి

బంగారం అంటే ఏమిటో మీకు తెలుసు వెండి తెలుసు, రాగి, ఇనుము తెలుసు, హైడ్రోజన్, ఆక్సిజన్, నైట్రోజన్‌లు తెలుసు. ఇవన్నీ మూలకాలు ప్రతీ మూలకానికీ ఒక ప్రత్యేకమైన సంఖ్యను ఇస్తూ, ఒక పద్ధతి ప్రకారం మూలకాలను నిలువు, అడ్డు గదులలో అమర్చారు ఇలా అమర్చగా వచ్చిన పట్టికను ఆవర్తన పట్టిక అంటారు. 1940 నాటికి ఈ పట్టికలో 92 గదులూ, గదికి ఒక మూలకం చొప్పున 92 మూలకాలు ఉండేవి. వీటిలో టెక్నీషియమ్, ప్రొమిథియమ్‌లు తప్ప మిగిలినవి అన్నీ ప్రకృతిలో దొరుకుతాయి. మూలకం ఒకటి హైడ్రోజన్ ఇది అన్నింటికంటే తేలికైనది. మూలకం 92 యురేనియమ్. ఇది అన్నింటికంటే బరువైనది హైడ్రోజన్ పరమాణు కేంద్రకంలో ఒకే ఒక ప్రోటాన్ ఉంటుంది. దాని చుట్టూ ఒక ఎలక్ట్రాన్ తిరుగుతూ ఉంటుంది. యురేనియం కేంద్రకంలో 92 ప్రోటాన్‌లు ఉంటాయి. దీని చుట్టూ వివిధ కర్పరాలలో 92 ఎలక్ట్రాన్‌లు తిరుగుతూ ఉంటాయి. కేంద్రకంలో ఉండే ప్రోటాన్‌ల సంఖ్యే పట్టికలో మూలకం గది సంఖ్య. దీనినే పరమాణు సంఖ్య అంటారు. కేంద్రకంలోని ప్రోటాన్‌ల సంఖ్య మారిపోతే మూలకం మారిపోతుంది. 26 ప్రోటాన్‌లు ఉన్న ఇనుము కేంద్రకానికి మరో 53 ప్రోటాన్‌లను చేర్చగలిగితే ఇనుము కాస్తా బంగారంగా మారిపోతుంది. ఇది సాధ్యం కాని పని!

పరమాణు నిర్మాణం గురించి ఏ మాత్రం తెలియని ప్రాచీన రసాయన శాస్త్రజ్ఞులు హీన లోహాలను బంగారంగా మార్చేయాలన్న తాపత్రయంతో వృథా ప్రయాస పడ్డారు. పరుసువేది అనే పదార్థం సహాయంతో ఇటువంటి పరివర్తనం సాధ్యమేనని వారు నమ్మారు. దీనిని రసవాదం అంటారు. ఆధునిక శాస్త్రజ్ఞుల దృష్టిలో ఇది మూఢనమ్మకం. అయినప్పటికీ 'ఒక మూలకాన్ని ఇంకొక మూలకంగా మార్చటం' అనే ప్రాథమిక సూత్రం ఈ రసవాదంలో ఇమిడి ఉంది. అభివృద్ధి చెందిన ఆధునిక విజ్ఞాన శాస్త్రం మూలక పరివర్తనం సూత్రప్రాయంగా సాధ్యమేనని నిరూపించింది. కొన్ని ప్రత్యేక పరిస్థితులను కల్పించి, ఒక మూలకాన్ని ఇంకొక మూలకంగా మార్చవచ్చునని 'రేడియో ధార్మికత'ను కనుగొనటంలో రూఢి అయింది. రూథర్‌ఫర్డ్ శాస్త్రజ్ఞుడు మొట్టమొదటి కేంద్రక పరివర్తనాన్ని సాధించగలిగాడు.

ఆవర్తన పట్టికలో కుటుంబాలు ఉంటాయి. ఒకే కుటుంబానికి చెందిన మూలకాలకు పోలికలు ఉంటాయి. వివిధ మూలకాల మధ్యనున్న పరస్పర సంబంధాలను శాస్త్రజ్ఞులు తెలుసుకోగలిగారు. కానీ చిట్ట చివరిగానున్న 90, 91, 92 మూలకాల మధ్యనున్న సంబంధాలు ఎటువంటివో ఇదమిద్ధంగా తేలలేదు. కాబట్టి మూలకం 92 తరువాత మరికొన్ని మూలకాలు ఉండవచ్చుననీ, అవన్నీ కలిసి ఒక మూలక కుటుంబం అయేందుకు వీలు ఉందని శాస్త్రజ్ఞులు ఊహించారు. ఈ మూలకాలను యురేనియమ్ తరువాతి మూలకాలు (Trans Uranium Elements) అంటారు. ఇవి ప్రకృతిలో దొరకవు. వీటిని కృత్రిమంగా ప్రయోగశాలలో సృష్టించాల్సిందే! అందుకే వీటిని మానవ నిర్మాత

మూలకాలు (Man made elements) అన్నారు. వీటి సృష్టికి మొట్ట మొదటి ప్రయత్నాలు 1934 లో రోమ్‌లో జరిగాయి. ఈ శాస్త్రీయ ప్రయత్నాలకు ప్రారంభకుడు ఎన్‌రికో ఫెర్మీ (Enrico Fermi). 1940 సంవత్సరంలో మాక్ మిలన్, అతని అనుచరులు మొట్ట మొదట మానవ నిర్మిత మూలకాన్ని కనుగొన్నారు సైక్లోట్రాన్ పరికరంలో యురేనియమ్‌ను న్యూట్రాన్‌లతో తాడింప జేస్తే మూలకం - 93 ఏర్పడింది. దీనిని నెప్ట్యూన్ గ్రహం పేరున నెప్ట్యూనియమ్ అని అన్నారు తరువాత కనుగొన్న మూలకం ప్లూటోనియమ్ ఇది కొద్ది ప్రమాణాలలో ప్రకృతిలో లభిస్తుంది.

ఈ విధంగా మూలకాలను సృష్టించడంలో మూలకం - 112 దాకా శాస్త్రజ్ఞులు సాధించగలిగారు. పరమాణు భారం పెరుగుతున్న కొద్దీ ఈ మూలకాల స్థిరత్వం తగ్గి పోతుంది, బరువు పెరగటంతో వాటి ఆయుష్షు తగ్గిపోతోంది, స్వల్పకాలం జీవించి ఉండే వీటిపై భౌతిక రసాయన శాస్త్ర పరమైన అధ్యయనాలు చేయడానికి శాస్త్రజ్ఞులకు వీలు చిక్కటం లేదు. అత్యంత బరువైన మూలకాల పరమాణువులకు సైతం స్థిరత్వం ఉండటానికి అవకాశం ఉందనీ సిద్ధాంత పరంగా 1940లోనే శాస్త్రజ్ఞులు ఊహించారు. పరమాణు కేంద్రకంలో ప్రోటాన్‌లు, న్యూట్రాన్‌లు కర్పరాలలో ఉంటాయనీ, ఇవి కూడా ఎలక్ట్రాన్ కర్పరాల వంటివేనని వారు భావించారు. కేంద్రకంలో ఉండే ఈ కర్పరాలు ప్రోటాన్, న్యూట్రాన్‌లతో పూర్తిగా నిండి ఉన్నట్లయితే కేంద్రకానికి స్థిరత్వం వస్తుందని వీరి విశ్వాసం. అటువంటి స్థిరత్వపుటంచును తాకినాసరే, బరువైన మూలకాల సృష్టికి అవకాశం లభించినట్లేనని భావించవచ్చు. ఓ అర్ధ శతాబ్దం నుండి ఈ స్థిరత్వపు లంక ఒడ్డు చేరే ప్రయత్నాలు జరుగుతూనే ఉన్నప్పటికీ, నిన్నటి మొన్నటి దాకా శాస్త్రజ్ఞులు అత్యంత బరువైన మూలకాన్ని 'సృష్టించడం' అనే లక్ష్యాన్ని సాధించలేక పోయారు. ఇక్కడ వచ్చిన చిక్కు ఏమిటంటే సైక్లోట్రాన్‌లో రెండు పరమాణు కేంద్రకాలు ఒక దానిని ఒకటి ఢీకొనడంలో అవి కలబోసుకొనే అత్యధిక శక్తి విలువలు ఏమేరదాకా ఉంటాయంటే కొత్తగా పుట్టిన మూలక పరమాణువు కేంద్రకం ఆ శక్తి సమక్షంలో ఆట్టే కాలం బతకలేకపోతోంది, ఏర్పడుతూ, ఏర్పడుతూనే ముక్కలైపోతోంది.

1999 సంత్సరం అడుగు పెట్టీ పెట్టడంతోనే జనవరి నెల 22 తేదీన 'సైన్సు' పత్రిక మూలకం -114 ఆవిష్కరణ గురించిన వార్తను ప్రచురించింది. రష్యా, అమెరికా శాస్త్రజ్ఞులు సంయుక్తంగా నిర్వహించిన ప్రయోగాల వల్ల ఇది సాధ్యమైంది. రష్యాలోని డుబ్నా (Dubna) లో ఉన్న Joint Institute for Nuclear Research లో ఈ ప్రయోగాన్ని నిర్వహించారు. 19 మంది శాస్త్రజ్ఞులు ఉన్నా ఈ Dubna బృందానికి Dr. Yun' Oganession సారథ్యం వహించాడు.

రష్యన్ సైక్లోట్రాన్‌లో అరుదైన ప్లుటోనియన్ ఐసోటోప్ పరమాణువులను అరుదైన కాల్షియమ్ ఐసోటోప్ పరమాణువులతో 4 నెలల పాటు చేసిన తాడనాల వల్ల ఈ సరికొత్త మూలకం ఏర్పడింది. దాని పరమాణు కేంద్రకంలో 114 ప్రోటాన్‌లు, సుమారుగా 184 న్యూట్రాన్‌లు ఉన్నాయి. ఇది అత్యంత బరువైన మూలకం. ఇది ఏర్పడ్డాక ఒక అరనిమిషం దాకా రేడియో ధార్మిక విఘటనం చెందకుండా స్థిరంగా ఉంది. ఇంత వరకూ కనుగొన్న మానవ నిర్మిత మూలకాల ఆయుష్షులతో పోల్చి చూస్తే దీని ఆయుష్షు ఎక్కువ, మూలకంపై శాస్త్ర పరిశోధనలు కొనసాగించడానికి ఈ ఆయుష్షు చాలును. శాస్త్రజ్ఞులకు ఈ ఫలితం చాలా ఆశా జనకంగా ఉంది. ఈ ప్రయోగానికి కావలసిన కాల్షియమ్

ప్లుటోనియమ్ ఐసోటోపులను Lawrence Livenmore Laboratory వారు అందించారు. ఇంకా మరికొన్ని గణనలు పూర్తి అయితేగాని ఈ మూలకం సృష్టిగురించిన పరిశోధనా వ్యాసాన్ని ప్రచురించ దల్చుకోలేదు అని ఈ శాస్త్రజ్ఞులు అంటున్నారు అయినప్పటికీ, మూలకం - 114 ఏర్పడింది అన్నా దానికి వారి దగ్గర చాలా బలమైన బుజువులు ఉన్నట్లుగా వారు చెపుతున్నారు

ఈ బృందంలోని రష్యన్ శాస్త్రజ్ఞులు Lawrence Berkely National Laboratorకి చెందిన Albert Giorso కి (e-mail)లో 114 మూలక ఆవిష్కరణ గురించిన వార్తను పంపారు. Giorso, ప్లుటోనియంను రూపొందించి నోబెల్ పురస్కారాన్ని అందుకొన్న Seaberg కి సహచార్యుడు 12 మానవ నిర్మిత మూలకాల ఆవిష్కరణలో పాలు పంచుకొన్నవాడు, అతను ఈ వార్తకు స్పందిస్తూ "Lawrence Berkely Laboratory లో పని చేస్తున్న నేను మూలకం - 114ని మా ప్రయోగశాలలోనే ఆవిష్కరించాలని ఎంతగా ఆశించానో మాటలలో చెప్పలేను. భౌతిక శాస్త్రం సాధించిన ఘన విజయాలలో ఇది ఒకటి ఈ వార్త విని సంతోషం పట్టలేక ఉబ్బి తబ్బిబ్బు అయ్యాను.

ఎవరు అయితేనేం! మొత్తానికి శాస్త్రజ్ఞులు లక్ష్యాన్ని సాధించగలిగారు. 88 అంగుళాలు ఉన్న Berkely Cyclotron లో Dubne బృందం చేసిన ప్రయోగాన్ని మేము మళ్లీ చేసి చూస్తాం. దీన్ని పునఃపరిశీలిస్తాం'' అన్నాడు.

మానవ నిర్మిత మూలకాలకై అన్వేషణ, వాటి ఆవిష్కరణ ప్రధానంగా పరిశోధనకూ, శాస్త్ర విజ్ఞాన అభివృద్ధికీ సంబంధించిన విషయమే అయినప్పటిక ఈ ఆవిష్కరణలు గతంలో అత్యంత ఉపయుక్తంగా పరిణమించాయి. ప్రపంచంలోని శిలాజ ఇంధనాల నుంచి లభించే మొత్తం శక్తి కంటే ఎన్నో లక్షల రెట్లు శక్తి యురేనియమ్‌లో నిక్షిప్తమై ఉంది. ప్రకృతిలో లభించే యురేనియమ్‌లో చాలా భాగం అణుశక్తి ఉత్పాదనకు ప్రత్యక్షంగా ఉపయోగ పడదు. దీనిని ప్లుటోనియమ్‌గా మార్చినప్పుడే శక్తివంతమైన అణుశక్తి జనకంగా ఉపయోగపడుతుంది. 1945లో నాగాసాకి మీద ప్రయోగించిన అణుబాంబు తయారీలో ప్లుటోనియమ్‌ని వాడారు. అణుశక్తికి శాంతియుత ప్రయోజనాలు కూడా ఉన్నాయి. Nuclear Reactor లలో విద్యుత్‌శక్తి ఉత్పాదనకు ప్లుటోనియమ్ ఉపయోగపడుతుంది. పరిశ్రమలు, వ్యవసాయం, పరిశోధన, వైద్య రంగాలలో దీని వినియోగం ఉంది.

ఇప్పటిదాకా 21 మానవ నిర్మిత మూలకాలను ఏర్పరచగలిగారు. మూలకం -113 ని మాత్రం ఇంతవరకూ సృష్టించలేదు. ఈ మూలకాలు మూలకం -118 దాకా ఉండటానికి శాస్త్ర పరమైన అవకాశం ఉంది.

పరమాణు కేంద్రక నిర్మాణం గురించిన సరికొత్త సిద్ధాంతాల ప్రతిపాదనలకు అత్యంత బరువైన మూలకం -114 నాంది పలకవచ్చు. దీని ఆవిష్కరణతో స్థిరత్వపు లంక ఒడ్డు చేరామని భావిస్తున్న శాస్త్రజ్ఞులకు మునుముందు మానవ నిర్మిత రసాయన మూలకాల సరికొత్త గదుల పెట్టె దొరకవచ్చు. మూలకం -114 వల్ల మనకి ఎటువంటి ప్రయోజనాలు చేకూరుతాయో వేచి చూద్దాం.

(ఆకాశవాణి, హైదరాబాద్ సౌజన్యంతో)

# నూతన కాంతులు ప్రసాదించిన బౌద్ధికసిద్ధాంతద్వయం
# ఫ్రాంకుఫర్టు స్కూలు

– శివలింగం

ఫ్రాంకుఫర్టు స్కూలు 23 ఫిబ్రవరి 1923లో అధికారికంగా స్థాపించబడింది. ఫెలిక్స్ జె.వెయిల్‌కు 1922లో జర్మనీలో సామాజిక పరిశోధన సంస్థ స్థాపించాలన్న భావం కలిగింది. వెయిల్‌తండ్రి జర్మనీ యూదు జాతీయుడు దక్షిణ అమెరికా వెళ్ళి పెద్దవ్యాపారస్తుడుగా మారిపోయాడు. విజయ పరంపరల పాలరాతి మెట్లమీదుగా చిటారుగదికి చేరుకున్నాడు. అంతవ్యాపారస్తుడైనా వివేకవంతుడైన మేధావి కూడా కావడం నుంచి సంపాదించిన ఆస్థిలో ఎక్కువ భాగాన్ని సామాజిక పరిశోధన సంస్థకు కేటాయించాలన్న సదుద్దేశం కలిగింది. కుమారుడు వెయిల్ ప్రోత్సాహం దోహదపడింది. సంస్థ స్థాపన జరిగాక దాన్ని ఫ్రాంకుఫర్టు యూనివర్సిటీకి అనుబంధం చేశారు. ఈ సంస్థ కార్యకలాపాలు 1932 - 1941 మధ్య కాలంలో విశేషంగా పేర్కొనదగినవి. ఒక పత్రికను కూడా నడిపారు. దాత ఎటువంటి నిబంధనలు పెట్టలేదు. అందుకే స్వాతంత్ర సంస్థగా వుండటం వల్ల పరిశోధకులు తమ భావాలను స్వేచ్ఛగా వెలిబుచ్చారు. డైరెక్టర్లు, సభ్యులు మార్క్సిస్టులు. అయినా పిడివాద మార్క్సిస్టుల మీదా, రష్యా కమ్యూనిజం మీదా విమర్శనాస్త్రాలను సంధించినవారే. 1930లో హార్కైమర్ సంస్థ డైరెక్టరయినాక ఉన్నతమైన కృషి జరిగింది. నాజీజం జర్మనీలో తలెత్తాక న్యూయార్కుకు, తరువాత కాలిఫోర్నియాకు వలస వెళ్ళిందీ సంస్థ, ఫెడరల్ జర్మన్ రిపబ్లిక్ ఏర్పడినాక జర్మనీకి వచ్చింది. అడోర్నో, హెర్బర్ట్ మార్క్యూస్, ఎరిక్‌ఫామ్, కారల్ విట్ ఫోజెల్, న్యూమన్, బెంజమిల్ వంటి మేధావులు ఈ సంస్థలో పని చేసినవారే. 1960లో మార్క్యూస్ అంతర్జాతీయ నాయకుడు స్థాయికి ఎదిగాడు. అతని ప్రభావంతో విద్యార్థి ఉద్యమాలు చెలరేగాయి. నగర టెర్రరిస్టులు మార్క్యూస్ రాతల వల్ల ఉత్తేజితులయినవారే. పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యంలో విప్లవశక్తులు తమ ఉనికిని కోల్పోయి ధనిక సమాజంలో విలీనం గావడంవల్ల విప్లవోద్యమాలు నీరుగారాయి.

జార్జిలూకాక్స్ ప్రభావం ఫ్రాంకుఫర్టు మార్క్సిస్టులమీద ప్రగాఢంగా వుంది. లూకాక్స్ జర్మనీ సంస్కృతిలో పెరిగిన యూదు. యాభైసంవత్సరాలు మార్క్సిజానికి అంకితమయినవాడు. తూర్పు యూరప్‌లో కమ్యూనిస్టు మేధా జీవితపు పొగమంచులో ఇతడొక్కడే దీపస్తంభంలా వెలుగుతున్నాడని ఇస్మాయిల్ అన్నాడు (కవిత్వంలో నిశ్శబ్దం - పే 111). మార్క్సిజం శాస్త్రీయ వేషం వేసుకుని నటించిందోగాని బూర్జువా కాలుష్యంతో అది బాధపడుతూనే వుందనడంలో సందేహం లేదు. సాహిత్య విమర్శలో ఫ్రాంకుఫర్టు స్కూలు సాంప్రదాయక బూర్జువా కళలోని రీతివాదాన్ని (Formalism) తప్పించడానికి ప్రయత్నించింది. అలాగే మార్క్సిస్టు సామాజిక వాస్తవికత వంధ్యత్వాన్ని పోగొట్టడానికీ యత్నించింది. అడోర్నో అభివ్యక్తి వాదాన్ని తోసిపుచ్చాడు. భగవంతుని సామ్రాజ్యాన్ని ప్రత్యక్షీకరించడం ఒక వైపు, మరోవైపు భగవంతుని అస్తిత్వం లేదని చైతన్యం ఆధారంగా చెప్పడం

ఫ్రాంకుఫర్టు స్కూలు వైమర్శిక సిద్ధాంత విరుద్ధా భాస మార్క్సిస్టు ఛాందసత్వాన్ని బద్దలు కొట్టి స్వేచ్ఛను ప్రసాదించింది. మార్క్సిస్టు కట్లు తెగ్గొట్టడంవల్ల కవులు మరింత మంచి కవిత్వాన్ని, మేధావులు ఉత్తమభావాలను వెలవరించగలిగారంటే అది ఫ్రాంకుఫర్టు స్కూలు ప్రభావం.

## నవ్య వామపక్షం

నవ్యవామ పక్షం (New Left) ఒక సంకీర్ణ భావసమాహారం. 1950 తరవాత ఫ్రాన్సులో విప్లవాత్మక భావాలతో తలెత్తింది. బ్రిటన్‌లో సాహిత్య సంస్థలు నడిపే న్యూరీజనర్, యూనివర్సిటి అండ్ లెఫ్ట్ రివ్యూ పత్రికలు తరవాత కలిసి పోయి న్యూలెఫ్ట్ రివ్యూ పత్రికగా అవతరించింది. సోవియట్ యూనియన్‌తోను పాశ్చాత్య దేశాలతో రాజీ పడలేక నిరాశ చెందిన వారంతా నవ్యవామపక్ష అనుయాయులుగా మారిపోయారు. సోవియట్ యూనియన్ హంగరీని ఆక్రమించింది. 1956లో సూయజ్ సంక్షోభంతో నవ్యపక్ష ఉద్యమం మరింత పెరిగింది. తిరుగుబాటుదారులంతా నిజమైన కమ్యూనిజాన్ని పునఃపరిశీలించడం ఆరంభించారు. అమెరికా, యూరపులలో విద్యార్థులు పారిశ్రామిక నాగరికతను, కార్పొరేట్ లిబరలిజాన్ని, పార్టీకి బానిసలా పని చేయడాన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. సార్త్రే, మార్క్యూస్ వంటి మేధావులు నవ్య వామపక్ష ఆలోచనను, తాత్వికతను సమకూర్చారు. ఫ్రాంజ్ ఫనాన్‌వంటి రచయితలు, ఛీగువేరావంటి గెరిల్లా పోరాట వీరులు ఛీగువేరా క్యూబాలో గెరిల్లా పోరాటాన్ని నడిపాడు) గెరిల్లా యుద్ధవ్యూహం (bee live effect) క్యూబాలో విజయవంతమయింది. తరవాత బొలీవియా వెళ్ళాడు. అక్కడ గెరిల్లా పోరాటం విఫలమయింది. ఛీగువేరా మరణించాడు.

హింసను ఆయుధంగా వాడటంలో మార్క్సుకు అభ్యంతరముండేమోకాని నవ్య వామపక్షీయులకు మాత్రంలేదు. నవ్యవామపక్షం అమెరికా, బ్రిటన్, సోవియట్ యూనియన్ ప్రభుత్వాలను, హింసనూ, స్టేట్ టెర్రరిజాన్ని. సమకాలీన పారిశ్రామిక సమాజాన్ని తీవ్రంగా విమర్శించింది. కార్మిక నియంతృత్వంగాని, నాగరిక సంక్షేమ పెట్టుబడి దారీ విధానం గాని వాటి స్వప్రయోజనం కోసం కృషి చేస్తాయి. నవ్య వామపక్షం విమర్శకు, నిరోధించడానికి, నిఘావేసి వుండటానికి ప్రాధాన్యత నిస్తుంది. సోవియట్ మార్క్సిజం గాని. బూర్జువా ప్రజాస్వామ్యం గాని నిరంకుశ విధానాలే. రెంటి సమాజాలూ పెట్టుబడిమీదే కేంద్రీకరిస్తాయి. రాజకీయ సామాజిక విషయాల్లో ప్రభుత్వాల జోక్యం పెరిగిపోయింది. ఈ విధమైన అభివృద్ధి ఫలితంగా ఒకకొత్త మేనేజీరియల్ క్లాస్ పుట్టుకొచ్చింది. కమ్యూనిస్టులు ట్రాట్స్కీలు, మావోయిస్టులు యింకా తదితరులు కాపిటలిస్టుల కన్నా తక్కువ కారు. పై వర్గంలో తీసుకున్న నిర్ణయాలు కార్మికవర్గం మీద బలవంతంగా రుద్దడం వల్ల ప్రజాస్వామ్యం నశించిపోయింది. పార్టీ, బ్యూరోక్రసీ కలిసి అధికారాన్ని చేజిక్కించుకుని వ్యక్తి స్వాతంత్ర్యాన్ని హరించింది.

మార్క్సు తొలి రాతల్లో (1814 - 1857) మానవతావాదిగా వ్యక్తి సుఖాన్ని ఆకాంక్షించాడు. పెరుగుతున్న పారిశ్రామిక ప్రపంచంలో మానవుని పరాయీకరణ సమస్యను వివరించాడు. మనిషి

కేవలం పని మనిషిగా మారాడు. జంతువుకు తనకూ తేడా లేదని భావించాడు. పరాయీకరణ వలన ఉద్భవించిన అసంతృప్తిని నవ్యవామపక్షం గుర్తించింది రాజకీయ, ఆర్థిక, విద్యా రంగాల్లో భాగస్వామ్యం సన్నిహిత్యతలను వాంఛించింది ఎరిక్‌ఫామ్ పరాయీకరణ ఆధునికత నుండి ఉత్పత్తి అయిందన్నాడు. మధ్యయుగంలో ఈ భావం లేదు పుట్టుకతోనే వారసత్వంగా వచ్చే వృత్తి విద్య అతనిది నిరుద్యోగ భయం లేదు, పోటీలేదు, వృద్ధాప్యంలో కుటుంబ సభ్యుల్ని లెక్క పెట్టుకునేవాడు, సంఘం దన్నుగా వుండేది, రినైజాన్సుతో మారిపోయింది గొప్ప సంస్కర్తలు మానవుని దుర్మార్గాన్ని, నేరమనస్తత్వాన్ని ఎత్తిచూపి తనమీద తనకే అసహ్యం ఏర్పడేలా చేయడంవల్ల నిస్సహాయుడుగా, పరాయివాడుగా తయారయాడు మతం గురించి కాక భౌతిక ప్రపంచంగురించి ఆలోచించడడం ఆరంభించాడు ధనం సంపాదించి ఇతరుల మీద పెత్తనం చెలాయించడంతో తృప్తి పడ్డాడు అధికారం సంపాదించి, ఆధునిక నాగరికతను నిర్మించి, పెద్ద పెద్ద పారిశ్రామికకేంద్రాలు నిర్మాణం కావిస్తున్నాడు. మానవుడికి సమాజానికి సంబంధాలు తెగిపోయినాయి. నవ్య వామపక్షం నాగరికతను విమర్శించింది. రచనల్లో రొమాంటిక్ భావాలు ఆదర్శాలుగా కనిపించాయి. ఆచరణ సాధ్యాలు కావు ఎరిక్‌ఫామ్ ఆదర్శరాజ్యానికి దగ్గరగావచ్చాడు. సార్త్రే హింసను ప్రోత్సహించాడు. అమెరికా స్థావరాల మీద మిస్సైల్సుతో దాడి చేయమన్నాడు. వియత్నాం, దూరప్రాచ్య స్థావరాలమీద, సోవియట్ యూనియన్‌లో నవ్యవామ పక్షం హింసను వ్యతిరేకించింది. తనను తాను రక్షించుకోడం కోసం హింసను అనుమతించడం జరిగింది ఇది ఆశ్చర్యకరమైన విషయం.

ఏక పక్ష పాలనకు పాజిటివిజానికి వున్న సంబంధాన్ని మార్క్యూస్ తెలిపాడు. సమాజాన్ని పునర్వ్యాఖ్యానించడానికి హెగెలియన్‌గతితర్కాన్ని మార్క్స్‌లాగా మార్క్యూస్ కూడా అంగీకరించాడు. గతితార్కిక భావవాదం బౌద్ధిక నియంతృత్వానికి దారి తీస్తుందన్న వాదనతో విభేదించాడు. కార్మిక నియంతృత్వానికి దారతీసిన గతితార్కిక భౌతిక వాదాన్ని తిరస్కరించాడు మార్క్యూస్ (Marcuse) పాజిటివిస్టులు ఏకపక్ష నియంతృత్వాన్ని అంగీకరించలేదు. 20వ శతాబ్దపు తార్కిక ప్రత్యక్ష జ్ఞానవాదులు పాసిస్టు భావాలను వ్యతిరేకించారు. మార్క్యూస్ ఏకపక్ష నియంతృత్వానికి పాజిటివిజానికి పొత్తు కలపడంతో నిజంలేదు. నవ్య పక్ష ఆదర్శ సమాజం అనార్కిజానికి సరిహద్దుల్లో వుంది. రాజ్యంలేదు, పాలితుడే పాలకుడు. ఇతర ఏ అధికారాన్ని అంగీకరించడు. అధికారాన్ని తిరస్కరించడం, తిరుగుబాటు ఉద్యమంగా ఎదగలేని అశక్తత నవ్యవామపక్ష బలహీనత. ఎరిక్‌ఫామ్ వంటివారు గాంధి ప్రవచించిన అనార్కిస్టు సమాజ ప్రతిబింబమే ప్రతిపాదించారు. ఉన్నత మధ్య తరగతి యువతరంలో నిరాశ, భంగపాటుల ఫలితంగా నవ్యవామపక్షం పుట్టిందనడం సరికాదంటున్నారు. మార్క్యూస్‌ది పేదరికం ఎరుగని వారి మనస్తత్వం. ధనిక వర్గపు యువతరాన్ని నవ్యవామపక్షం ఆకర్షించింది. 1970తో నవ్యవామ పక్షం అంతమయింది. మనదేశంలో నిత్యావసరవస్తువుల కొరత, నిరుద్యోగం, పెరుగుతున్న దారిద్ర్యం, ఉన్నత విద్యాసంస్థల్లో నిరాశ వంటి సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి. కొత్త ఉద్యమాలు తలెత్తుతాయి. భారతదేశంలో బౌద్ధిక ఉద్యమాలకు అవకాశాలు లేవు.

# మహా విదూషకుడి మహోపన్యాసం

– డా. దేవరాజు మహారాజు

క్షమించాలి ! నాకు చక్రవర్తిని కావాలని లేదు అలాంటి ఉద్దేశమే లేదు. ఎవరినో జయించాలనికాని, ఎవరి మీదనో పెత్తనం చలాయించాలని కానీ నాకు లేదు. తెలుపు, నలుపు అన్న తేడా లేదు. ప్రతి వారికీ చేయగలిగినంత సహాయం చేయాలనే ఉంది. ఒకరి కొకరం మనం సహాయ పడుకుంటూ ఉండాలి. ఎదుటి వారి సంతోషమే మనకు స్ఫూర్తిని, సంతృప్తిని ఇస్తుంది, వారి దుఃఖం కాదు - ఒకరిని అసహ్యించుకోవడం, అవహేళన చేయడం మనం కోరుకోం. ఈ విశాల ప్రపంచం అందరిదీ. తల్లి భూదేవి బిడ్డలం మనమంతా. ఆమె దగ్గర దేనికీ కొదువ లేదు. స్వేచ్ఛానందానికి ప్రతిరూపమవ్వాలి మన జీవితం !

కాని, మనం దారి తప్పుతున్నాం. స్వార్థం మానవుల ఆత్మల్ని విషపూరితం చేస్తోంది. కుత్సితాలతో ప్రపంచాన్ని కుంచింప జేస్తోంది. కుటిలత్వానికి, రక్తపాతానికి మానవుల్ని చేరేస్తోంది. వేగాన్ని అభివృద్ధి పరిచాం. నిజమే! కాని మనలో మనమే ముడుచుకుంటున్నాం. యంత్రాలు కావాల్సినవన్నీ తయారు చేస్తున్నాయి. కానీ మన కోర్కెల దాహం తీరడం లేదు.

మన విజ్ఞానం మనల్ని మానవ ద్వేషులుగా చేస్తోంది. మన తెలివి తేటలు మనల్ని నిర్దయులుగా, కఠినాత్ములుగా తీర్చి దిద్దుతున్నాయి. మనం చాలా ఎక్కువగా ఆలోచిస్తాం. అవసరమైనప్పుడు చాలా తక్కువగా స్పందిస్తాం. యంత్రాల యంత్రాంగం కన్నా; మనకు మానవత్వపు మనుగడ ముఖ్యం కావాలి. మితిమీరిన తెలివి తేటల కన్నా మర్యాద, మన్నన, దయార్ద్రహృదయం కావాలి. ఈ లక్షణాలు లేని జీవితం భయానకమై నశిస్తుంది.

రేడియో, విమానాలు మానవుల్ని దగ్గరి పరిధిలోకి చేరుస్తున్నాయి. మానవునిలోని మంచితనమే వీటిని కనుక్కోగలిగింది. విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని ఎలుగెత్తి చాటింది. నా ఈ మాట ప్రపంచం లోని కోటానుకోట్ల ప్రజలకు అందుతోందని తెలుసు. పురుషులు, స్త్రీలు, పసిపిల్లలు, నిరాశా సదృశ్యులు... పీడించే ఈ వ్యవస్థకు బలైన అమాయకులూ... ఎవరూ నిరాశపడవద్దు. మానవ పురోగతి కదిగొడ్డలి పెట్టు.

ఈర్ష్యా ద్వేషాలు నశిస్తాయి. నియంతలు నశిస్తారు. ప్రజల నుండి లాక్కున్న అధికారం తిరిగి ప్రజలకే దక్కుతుంది. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు నశించవు. తాత్కాలికంగా అణచబడ్డా, అవి సంకెళ్ళు తెంపుకుని ధైర్యంగా బతుకుతాయి. సైనికులారా ఆలోచించండి. దుష్టుల పక్షాన, దుర్మార్గుల పక్షాన నిలబడొద్దు. మీకు తిండి పెట్టి, కసరత్తులు చేయించి మిమ్మల్ని పూర్తిగా వాడుకునేవాడు ఎలాంటి వాడో ఒకటికి రెండుసార్లు బాగా ఆలోచించండి. మీ ఆలోచనల్ని, మీ అనుభూతుల్ని శాసించే హక్కు ఎవరికీ లేదు. మీరు పశువులు కాదు. గడ్డి పోచలు కాదు. మానవ యంత్రాలకు దాసోహమనేది

లేదు. యాంత్రిక మేధస్సులు, యాంత్రిక హృదయాలూ గల కృత్రిమమైన ''యంత్రాలు'' వాళ్ళు. మీరు యంత్రాలు కాదు - మనుషులు! మానవత్వం పట్ల మీకు అచంచల విశ్వాసం ఉంది. ఎదుటివారిని నిరంతరం ప్రేమించగల గొప్ప హృదయం ఉంది. ఎవరిచేతా ప్రేమించబడని కొద్దిమంది యంత్ర - మానవులు మాత్రమే అసహజంగా, కృత్రిమంగా ప్రవర్తిస్తారు.

వీర సైనికులారా స్వేచ్ఛ కోసం పోరాడండి. బానిసత్వం కోసం కాదు. మీలో ఒక మహత్తర శక్తి ఉంది. జీవితాన్ని అందంగా, ఆనందంగా, సుఖప్రదంగా తీర్చిదిద్దుకోగల శక్తి మీలోనే ఉంది. యంత్రాల్ని సృష్టించుకోగల నేర్పరులు మీరే మీకు మీరై యంత్రాలై పోకుండా మనుషులుగా నిలదొక్కుకోగలిగే ఆత్మశక్తి మీలోనే ఉంది. దాన్ని బయటికి లాగండి ఇంకా ఆలస్యమెందుకూ? రండి ప్రజాస్వామ్యం పేరిట ఏకమై ఒక కొత్త ప్రపంచాన్ని సృష్టించుకుందాం ప్రతి వాడికీ పని, యువతకు మంచి భవిష్యత్తు, వృద్ధాప్యానికి భద్రత గల ఒక మంచి సమాజాన్ని సృష్టిద్దాం ఇలాంటి మాయ మాటలూ, అబద్ధాలూ చెప్పి అవినీతి పరులంతా, అహంకారులంతా గద్దె లెక్కుతున్నారు. వాగ్దానాలను నిలబెట్టుకున్న వారు ఇంతవరకూ ఎవరూ లేరు. ఇప్పుడు మనకై మనమే వాటిని సాధిద్దాం జాతీయ అంతర్జాతీయ స్థాయిలో సైతం స్వేచ్ఛకు అడ్డుగోడల్ని తొలగిద్దాం. దురాశ, దుఃఖం, అసూయ, క్రూరత్వాలకు నిలువనీడ లేకుండా చేద్దాం. శాస్త్ర సాంకేతికాభివృద్ధి సాధించే ప్రగతివైపు పయనిద్దాం రండి. అందరం ఏకమౌదాం!

ఇది ''ద గ్రేట్ డిక్టేటర్'' (1940) సినిమా చివర్లో ఛార్లీ చాప్లిన్ చేసిన మహోపన్యాసం!

ఈ సినిమాలో చాప్లిన్ ద్విపాత్రాభినయం చేశారు. ఒకటి - హిట్లర్ (డిక్టేటర్) పాత్ర. రెండు - మంగలి పాత్ర. (చాప్లిన్ భార్య పాలెట్టి గడ్డార్డ్ ఈ సినిమాలో మంగలి వాడి ప్రేయసిగా నటించారు.)

వేల సంఖ్యలో సైనికులు బారులు తీరి వున్న సన్నివేశమది. వందల సంఖ్యలో మిలట్రీ అధికారులు హిట్లర్ కోసం ఎదురుచూస్తూ ఉంటారు. ఆ మహా సభలో హిట్లర్ మాట్లాడవల్సి ఉంటుంది. కానీ ఆ సమయానికి అక్కడికి హిట్లర్ బదులు, అతని పోలికలతో వున్న మంగలివాడు చేరుకుంటారు. అతనే హిట్లరనుకుని అధికారులు గౌరవ వందనం సమర్పించి, వాణ్ణి వేదిక మీదకి తీసుకు వెళతారు. అతిసామాన్యుడైన మంగలివాడు ఏం మాట్లాడగలడూ? ఒక నిముషం తడబడి ఆ తర్వాత - ఒక సామాన్యుడిగా తను కోరుకుంటున్న దేమిటో అదే మాట్లాడతాడు. అదే ఈ ఉపన్యాసం. హిట్లర్‌ను ఎద్దేవా చేసే ఛార్లీ చాప్లిన్ తన అంతరంగాన్ని అతి సామాన్యుడైన మంగలి వాడి పాత్ర ద్వారా ఈ విధంగా వ్యక్తం చేశాడు. అతడి అంతరాత్మ మానవాళికి చేసిన బోధే ఈ ఉపన్యాసం! ఇది వెలువడి అరవై యేళ్ళు కావస్తున్నా నిత్య నూతనంగా ఉంది. ఈ కాలానికి సరిపోయే విధంగా కూడా ఉంది. చాప్లిన్ మహాదార్శనికుడు అనడానికి ఇదొక మంచి ఉదాహరణ! ఇక్కడ మరొక విశేషం ఉంది హిట్లర్‌ను ఛార్లీ చాప్లిన్ ఆటపట్టించాడు - కాని హిట్లర్ ఛార్లీ చాప్లిన్ (1889 - 1977) అభిమానుల్లో ఒకడు.

# రవీంద్రుని కవిత - మార్మికత

– దమ్మాలపాటి వెంకటేశ్వరరావు

గురుదేవ్ రవీంద్రనాథ్ ఠాగూర్ పేరు విననివారు ఎవరూ ఉండరు. 20వ శతాబ్దపు భారతీయ సాహితీ జగత్తును సుసంపన్నం చేసిన కొద్దిమంది మహానుభావులలో ఆయన గణ్యమాన్యుడు. ఆయన ప్రజ్ఞ బహుముఖం. కవిగా, మనీషిగా, మానవతావాదిగా, జాతీయవాదిగా, అంతర్జాతీయవాదిగా ఆయన ఖ్యాతి విశ్వవ్యాప్తం. ఆయన నవయుగవైతాళికుడు; ప్రబుద్ధ భారత సందేశ వాహకుడు, ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతుల సంగమస్థలి

సాహిత్యాకాశంలో ఆయనది ఒక విరాట్ స్వరూపం ఆయన కలం నుంచి సాహిత్య ప్రక్రియలన్నింటికి జీవం లభించింది. కథలు, నవలలు, నాటికలు, నాటకాలు, నృత్యనాటికలు, గీతికవితలు, స్మృతి రేఖలు మొదలైనవెన్నో శరంపరగా ఉద్భవించాయి రవీంద్రుని జీవితం ఇంతటి వైవిధ్యంతో కూడినదైనప్పటికి భారతీయుల హృదయాలలో కవిగానే ఆయన చెరగని ముద్రవేసుకున్నాడు. ఆయన ఉత్కృష్టకృతి 'గీతాంజలి'కి నోబెల్ బహుమానం లభించడమే అందుకు కారణం. ఆయన కవిత్వపు ఇతివృత్తం ఆత్మ పరమాత్మల సంబంధాన్ని విశ్లేషించడం. దీనికి మార్మిక కవిత్వం అనిపేరు ఈ మార్మిక కవిత్వపు పరాకాష్ఠ రూపాన్ని మనం 'గీతాంజలి' లో దర్శిస్తాము. రవీంద్రుని కవితను విశ్లేషించబోయేముందు మార్మిక కవిత్వం అంటే ఏమిటో నిర్వచించడం సముచితంగా ఉంటుంది అనుకుంటాను. సృష్టిలో మనకు కనిపించే ఈ చరాచర జగత్తంతా ఈశావాస్యం - భగవంతునిచే వ్యాప్తమైనది అని విశ్వసించడం ఈ కవిత్వ లక్షణం. అటువంటి పరమాత్మ నుంచే ఈ ఆత్మ ప్రాదుర్భావం జరుగుతుంది. కొంతకాలం ఈ జగత్తనే రంగస్థలం మీద తన నాట్యహేలా విలాసాన్ని ప్రదర్శించి చివరకు ఇది పరమాత్మలో లీనమవుతుంది.

మార్మిక కవి సృష్టిలోని ప్రతిస్పందనలోను భగవంతుని దర్శిస్తాడు. పక్షుల కలరవాలలో, ప్రభాత అరుణిమలలో, మలయానిల వీచికలలో, వసంతమంజరులలో, సముద్ర తరంగాల నాట్యహేలా విలాసంలో, జలపాతాల గర్జాఘోషలో, ఝంఝామారుత తాడనంలో ఒకటేమిటి సర్వే సర్వత్రా సర్వో పగతుడైన ఆ పరమాత్మను చూస్తాడు. ఈ సృష్టి యావత్తూ భగవంతుని సంగీత విభావరి. దానికి ఆయనే సంగీత నిర్దేశకుడు. ఈ సంగీత విభావరిలో పాల్గొనే భక్తుడు భగవంతుని ప్రియుడుగా, ప్రేయసిగా, సఖుడుగా, యజమానిగా, ఇంకా ఎన్నెన్నో బంధు భావనలతో భావన చేస్తాడు. ఈ భావాలన్నీ 'గీతాంజలి'లో సాకార రూపం ధరించాయి. భగవంతుని సన్నిధిలో తన పాట వినిపించడానికి భక్తుడు పడే తపన 'గీతాంజలి' లో ఎలా రూపుదిద్దుకుందో చూద్దాము.

> ''ప్రభాత సమయాన, మంద మలయ పవన వీచికలలో,
> సువర్ణ వీణపై స్వర సంధానం చేసినప్పుడు, నన్ను
> నీ ముందుకురమ్మని ఆదేశించి ఆదరించు ప్రభూ!'' అంటాడు.

అనంతరం అతనికి అనుమతి లభిస్తుంది. తనకు ఆ అవకాశం లభించినందుకు అహంకార దర్పంతో ఒక్క క్షణం ఉక్కిరి బిక్కిరి అవుతాడు. వెంటనే హృదయం ద్రవిస్తుంది. ఈ మానసిక స్థితికి గురుదేవుడు కల్పించిన శబ్ద చిత్రాన్ని తిలకించండి:-

''నీవు పాడమని ఆజ్ఞాపించినంతనే, అహంకార దర్పంతో
నా హృదయం పగిలిపోతుందా అనిపించింది ....... ఇప్పటి
వరకు నా జీవితంలో ప్రోగుపడి ఘనీభూతమైన అపశ్రుతు
లన్నీ కరగి మధుర రసఝరీ నాదంగా మారాయి'' ఎంతటి భావ విహ్వలత!

ఇక అతని గీతాలు ''తరంగ భంగిగా స్వేచ్ఛతో శబ్ద దాస్య విముక్త రాగమాలికలైపొంగి ప్రవహిస్తాయి.'' పునీతమైన ఈ గాన స్రోతస్సు అవరుద్ధ శిలాఖండాలన్నింటినీ చీల్చుకుంటూ ముందుకు సాగిపోతుంది అంతేకాదు భగవంతునితో స్వర సాంగత్యాన్ని నెలకొల్పుకోవాలని అతడు ఆరాటపడతాడు. కాని ఉత్సాహానికి తగినంతగా అతని వాణి సహకరించడంలేదు. ఏదో మంత్రముగ్ధుడైనట్లు అతనికి అనుభూతి కలుగుతుంది. ఈ చిత్రీకరణ ఎలా జరిగిందో చూద్దాము: -

''నీ స్వరంలో స్వరం కలపాలని నా హృదయం పరవళ్లు
త్రొక్కుతున్నది. మధుర మంజుల నాదం కోసం వృథా
ప్రయాస చేస్తున్నది. నేను మాట్లాడతాను. కాని నా మాటలు
పాటరూపం ధరించడం లేదు. అహో! అనంతమైన నీ సంగీత
పాశంలో నా హృదయాన్ని మంత్రముగ్ధం చేశావు ప్రభూ!''

ఆత్మపరమాత్మల లీలలు చిత్ర విచిత్రంగా ఉంటాయి. భక్తుడు భగవంతుని చేరడానికి ఎంత తహతహ లాడతాడో భగవంతుడు కూడ భక్తుని సమీపించడానికి అంతటి ఉత్కంఠనే చూపుతాడు. అయితే భగవంతుని ఆగమనానికి భక్తుడు సిద్ధంగా ఉండడు బాహ్యాడంబరాలకు ప్రాధాన్యత నిచ్చి ఈ సదవకాశాన్ని జారవిడుచుకుంటాడు. ఈ సన్నివేశ చిత్రీకరణ ఎలా ఉందో చూద్దాము: -

''ప్రభువు వచ్చి నా ప్రక్కనే ఆశీనుడయ్యాడు. అయినా నేను
మేల్కొనలేదు. నేను ఎంతటి నిర్భాగ్యుణ్ణి!''

మరోచోట

''అతనికి ఆసనాన్ని సిద్ధం చేయడంలోనే రోజంతా గడచిపోయింది. ఇంకా దీపాన్ని వెలిగించనేలేదు. ఇంట్లోకి రమ్మని అతన్ని ఎలా ఆహ్వానించను!''

ఈ విధంగా భగవత్ సాక్షాత్కారానికి లభించిన సువర్ణ అవకాశాన్ని వృథా చేసుకుంటాడు. అయినా తన ప్రయత్నం మానడు. అతనికోసం సుదీర్ఘ నిరీక్షణ అనంతరం భక్తుడు నిద్రాదేవత ఒడిలోకి జారుకుంటూ తనకు నిద్రాభంగం చేయవద్దని తన స్నేహితులను అభ్యర్థిస్తాడు. ఎందుకు? భగవంతుని కర స్పర్శతో మాత్రమే తాను మేల్కొనాలి. తనకు మెలకువ వచ్చినప్పుడు ఆ జ్యోతిర్మయ రూపం ఒక్కటే తనముందు ప్రత్యక్షమవ్వాలి.

''జ్యోతులన్నింటిలో ప్రథమజ్యోతియై
రూపాలన్నింటిలో ప్రథమరూపమై
నా కళ్లముందు అతణ్ణే సాక్షాత్కరింపనీ''
అని అభివర్ణిస్తాడు కవి ఈ దృశ్యాన్ని

భగవంతుడు భక్తుని సమీపిస్తున్నట్టు అనేక సంకేతాల ద్వారా తెలుస్తూ ఉంటుంది. ఇంకా సాక్షాత్కారం జరగలేదు. '' ఎన్నో ప్రభాత సాయం సమయాలలో నీ పద ధ్వనులు వినడం జరిగింది . వాయుమండలంలో పరి వ్యాప్తమైన నీమధుర మంజుల సాక్షాత్కారానందపరిమళాన్ని నేను అనుభవిస్తున్నాను'' అంటాడు కవి.

ఇక మధుర భావనలకు సంబంధించిన సన్నివేశాలు అనేకచోట్ల హృద్యంగా చిత్రించబడ్డాయి. ఇక్కడ భక్తుడు ప్రేయసి, భగవంతుడు ప్రియుడు. ప్రేయసితో సమాగమనానికి ప్రియుడు వాగ్దానం చేశాడు. ప్రియుని కోసం పుష్పాలను కానుకగా పరచి ఉద్విగ్నమానసయై గంటల తరబడి నిరీక్షిస్తున్నది. ప్రియుడు ఎంతకీ రాడు. దారిన పోయేవారు ఆమె దగ్గరకు వచ్చి ఒక్కొక్క పువ్వును తీసుకొని పోతూ ఉంటారు. వారి దరహాసం ఆమెను సిగ్గుతో ముంచెత్తుతుంది. తనకు ఏమి కావాలని వారు అడిగినప్పుడు ఆమె నయనాలు వాలి పోతాయి. ఇప్పుడీ విరహోత్కంఠిత నాయిక మానసిక స్థితిని తిలకించండి:-

'' అహో! నేను నీ కొరకు నిరీక్షిస్తున్నానని
నీవు వస్తానని వాగ్దానం చేశావని
నేను వారితో ఎలా చెప్పగలను!'' అంటుంది.

ఎంతటి మనోవైజ్ఞానిక విశ్లేషణ! మరో చిత్రాన్ని చూద్దాం:-

'' ఈ నిర్జన పథంలో నీవొక ఏకాంత పథికుడవు
అహో నా అనన్య మిత్రమా, శ్రేష్ఠప్రియతమా,
నా గృహ ద్వారాలన్నీ తెరచే ఉన్నాయి
స్వప్నాభాసవలె నన్ను ఉపేక్షించి వెళ్లకు''

భగవంతుని ప్రియునిగా చూడడం భారతీయ సంప్రదాయమైతే ఆయన్ని ప్రేయసిగా భావన చేయడం ఫారసీ కవితా పరంపర. ఆశిక్ - మాశూక్ ( ప్రియుడు - ప్రేమిక) భావన దీనినే ప్రతిబింబిస్తుంది. ఈ రెండు పద్ధతులు మధుర భావనలో అంతర్భాగాలే. ఈ ధోరణికి ప్రతీకగా ఒక ఉదాహరణ:-

''అహో ప్రేమస్వరూపిణీ! నీ గృహ ప్రాంగణంలో
నేను ఒంటరిగా పడిగాపులు కాసేటట్లు ఎందుకు చేశావు!''

ఇక సఖ్యభావనలో భక్తుడు భగవంతుడు కలిసి ఆడుకుంటారు. పాడుకుంటారు. వారిద్దరి జీవితం కోలాహలంగా గడుస్తుంది. ప్రభాత సమయంలో మిత్రునివలె వచ్చి భక్తుని నిద్రలేపి వృక్ష పంక్తుల మధ్య ఇద్దరు పరుగులు తీస్తారు. వారిద్దరి మహో లీలా సంరంభం ఆకాశమంతా పరివ్యాప్తమవుతుంది. వారి స్వర సమ్మేళనంతో వాయుమండలం ప్రకంపిస్తుంది. వారి దాగుడు మూతలతో యుగాలు గతిస్తాయి.

భగవంతుడు ఆనంద స్వరూపుడు - ఆయన దివ్య విభూతులు నిరంతరం భక్తుని మీద వర్షిస్తూ ఉంటాయి. ఈ నశ్వర కలశం ఎప్పుడూ ఖాళీ అవుతూ ఉంటుంది. అది మళ్లీ మళ్లీ నవ్య జీవనంతో నింపబడుతుంది. పృథివిని తన హరితశయ్యా పారవశ్యంలో పులకింపజేసే ఆ ఆనంద స్వరూపునికి తనను కైంకర్యం చేసుకోవాలని భక్తుని ఆరాటం.

'' ఈ చిన్ని పూవును కోసి తీసుకో
. రంగు అంత ప్రగాఢం కాకపోయినా
సుత్తు నిరజిమ్మే వాసన లేకపోయినా
ఈ పుష్పాన్ని నీ సేవకు ఉపయోగించుకో
పరువం ఉండగానే దీనిని త్రుంచుకో స్వామీ'' అంటాడు.

ఇక ఉపనిషద్ ప్రతిపాదితాలైన ''సత్యం, జ్ఞానం, అభయం'' అనే భావనలు రవీంద్రుని కవితలో పూర్తిగా వికసిత రూపం ధరించాయి. ఈ సృష్టిలో ''నన్ను చూసి ఎవరూ భయపడ కుందురుగాక! నేనెవరికీ భయపడకుందునుగాక!'' దీనిని గురుదేవుడు ఎంత రమ్యంగా చిత్రించాడో చూడండి:-

''చిత్తమెక్కడ భయరహితమై విలసిల్లునో
మస్తకమెక్కడ ఉన్నతమై విరాజిల్లునో
జ్ఞాన మందిరమెక్కడ సర్వజనప్రవేశార్హమో

ధీర గంభీర సత్యాంబుధి నుండి
ఎచట వాగ్దేవి ప్రభవించునో
ఓ నా ప్రభూ! అట్టి స్వేచ్ఛా స్వర్గమునందు
నా దేశము మేల్కొనుగాక!''

ఈ విధంగా రవీంద్రుని కవితాంబుధిలో ఎంత లోతుకు మునిగితే అన్ని మణులు, మాణిక్యాలు మనకు లభిస్తాయి. అయితే కాలుడుకి తల వంచక తప్పదు గదా! చివరగా ఆత్మ పరమాత్మలో కలిసే సమయం ఆసన్నమైంది. క్రీడ పరిసమాప్తమైంది. ఇక పరమాత్మ సాయుజ్యం చెందకుండా ఆత్మ ఒక్క క్షణం కూడ నిలువలేదు. తన ఉద్గమస్థానానికి ఆగని వేగంతో పయనిస్తున్నది. దీని చిత్రీకరణ ఎంత కమనీయంగా ఉందో అవలోకించండి :-

''గృహ విరహ వేదనాపీడితమైన
కొంగల గుంపు
తమ పర్వత ఆవాసాలకు తిరుగు ప్రయాణమై
దివారాత్రులు ఆకాశగమనం చేస్తున్నవిధంగా
నేను నీకు సమర్పించే ఒకే ఒక్క అభివందనంతో
నా జీవితమంతా ఆదిమధ్యాంతరహిత గేహానికి
పయనమగు గాక!

(ఆకాశవాణి విజయవాడ వారి సౌజన్యంతో)

# కట్టుకథల విధ్వంసం

– యస్. ఎ. మహమ్మద్

ఆధునిక భారత దేశాన్ని అర్థం చేసుకునేందుకు లౌకికతత్త్వం వంటి ఒక స్పష్ట భావన కూడ ప్రధానం కావడం కొంత అసాధారణంగా కనిపించవచ్చు. లౌకికతత్త్వమనేది అసలు ఒక వివాద విషయమేనా? లేక కేవలం వంచనా శిల్పమా? దేశవిభజన జరిగినపుడు పాకిస్తాన్ మతరాజ్యంగా ఆవిర్భవించింది. కాని భారతదేశం లౌకిక రాజ్యాంగాన్ని ఎంచుకుంది.

న్యాయ పరంగానేకాక, దేశంలోని సర్వోన్నత పదవి ఎంపిక వరకు అంచెలంచెలుగా ఉన్న వివిధ సాంఘిక, రాజకీయ అమరికలను దృష్టిలో ఉంచుకుంటే ఈ భేదం చాల ముఖ్యమైనదే. పాకిస్తాన్‌లో సర్వోన్నత పదవిలో విధిగా ముస్లిం ఉండాలి. ఇక్కడ అటువంటి నిబంధన లేదు. రాష్ట్రపతి పదవి మొదలుకుని అనేక ఉన్నత పదవుల్లో హిందువేతరులు ( ముస్లింలు, శిక్కులు) ఉన్న సందర్భాలెన్నో ఉన్నాయి.

లౌకిక తత్త్వమనేది వాస్తవంగా ఒక విస్తృతార్థాన్ని కలిగి ఉన్న భావనలోని భాగం భారతదేశంలో భిన్నమత విశ్వాసాలు, భిన్న భాషాసమూహాలు, వివిధ సామాజిక విధానాలు ఉన్నాయి. ఇంతటి భిన్నత్వాన్ని గుర్తించడంలోని ఒక అత్యంత ప్రముఖ అంశం ఈ లౌకిక తత్త్వభావన. ఈ లౌకిక తత్త్వాన్ని ఒక మతం ఆధారంగా విధ్వంసం చేయదలచుకున్న మతవర్గ శక్తులు ఈ దేశంలో కేవలం ముస్లింల ఉనికి, హక్కులతోనే కాదు, ఈ దేశపు ప్రాంతీయ, సాంస్కృతిక, సామాజిక భిన్నత్వాలతో కూడ తలపడవలసి ఉంది. ఈ తారతమ్యాల పట్ల సహనాన్ని విభజించి చూడటం సులభంకాదు.

భారతదేశజనాభాలో ముస్లింల సంఖ్య స్వల్పమేమీ కాదు. ప్రతి ఐదుగురిలోను నలుగురు హిందువులుగా వ్యవహరింపబడినప్పటికీ, ఇక్కడ నూరు మిలియనులకు మించి ముస్లిం జనాభా ఉంది. ఇది పాకిస్తాన్‌తో పోలిస్తే కొంత తక్కువ, బంగ్లాదేశ్‌కంటే చాల ఎక్కువ. ఈ దృష్టితో చూస్తే ప్రపంచంలోనే అతి పెద్ద ముస్లిం జనాభా కలిగిన మూడవ దేశం భారతదేశం. అంతేకాదు, దేశసామాజిక, సాంస్కృతిక జీవితంలో హిందువుల, మహమ్మదీయుల మధ్య జరిగిన విలీనం దృష్ట్యా కూడ ఈ దేశాన్ని కేవలం హిందువుల దేశంగా భావించడం గాభరా కలిగించే విషయం.

ఈ భిన్నత్వం హిందూ, ఇస్లాం మతాల వరకే పరిమితంకాదు ఇక్కడ పెద్ద సంఖ్యలో శిక్కులు, చెప్పుకోదగ్గ సంఖ్యలో క్రైస్తవులు ( వీరి చరిత్ర ఇక్కడ క్రీ.శ. 4వ శతాబ్దంలో, బ్రిటన్‌లో కంటే చాల ముందుగానే ప్రారంభమయ్యింది. ) జెరూసలెం పతనానంతరం అనతికాలంలోనే నెలకొనిన యూదుల నివాసాలు, మతసహనం అంతగాలేని పర్షియానుండి వచ్చిన పారశీకులు, మిలియన్ల సంఖ్యలో జైనమతస్థులు, ఎంతోకాలం అశోకుని వంటి ఎందరో చక్రవర్తుల చేత అధికారికమతంగా ఆదరింపబడిన బౌద్ధమతానుయాయులు ఉన్నారు. జవహర్‌లాల్‌నెహ్రూ వంటి నిరీశ్వర వాదులు, అజ్ఞేయతావాదులు చాలా పెద్ద సంఖ్యలో ఉన్నారు. అయినా వీరిని జనాభా లెక్కల్లో కమ్యూనిటి బ్యాగ్రౌండ్ ఆధారంగా హిందువులుగా వర్గీకరిస్తున్నారు.

రాజ్యాంగం ఏ ఒక్క మతం పట్ల ప్రత్యేక అభిమానాన్ని కలిగి ఉండరాదని భారతరాజ్యాంగ నిర్మాతలు కోరుకున్నారు. ఇంతటి భిన్నత్వం ఉన్న దేశానికి లౌకికతత్త్వం తప్ప మరేదీ న్యాయం చేయలేదు. ఈ మత పరమయిన భిన్నత్వ సమస్య హిందూమతానికి ఇతరమతాలకు మధ్య సంబంధాల వరకే పరిమితం కాదు. ఇది హిందూ మతంలోనే అంతర్గతంగా ఉన్న భిన్నత్వానికి సంబంధించింది

కూడ ఒకే మతంగా హిందూమతాన్ని భావిస్తే, దాని నిర్మాణంలోనే ఉన్న భిన్నత్వాన్ని అంగీకరించక తప్పదు. ఇది కేవలం కులాలకు సంబంధించిందే కాదు, ఆలోచనా రీతులకు సంబంధించినది కూడా. ప్రాచీన హిందూ ''షడ్దర్శనాల'' సర్గీకరణ కూడ విశ్వాసాల్లో ఉన్న తీవ్ర అంతరాలను, తర్క రీతులను అంగీకరించింది

'హిందూ' అనే శబ్దం ఒకే మతవిశ్వాసాన్ని కలిగి ఉన్న జనసమూహాన్ని సూచించేందుకు కాక ఒక ప్రదేశాన్ని సూచించేందుకు ఉపయోగించబడింది. పర్షియనులు, గ్రీకులు సింధూనది ప్రవహించే ప్రాంతాన్ని హిందూ దేశంగా, అక్కడి స్థానికులను హిందువులుగా భావించారు. పర్షియా, అరబిక్ భాషలలో భారతదేశంలోని ముస్లింలను ఒక దశలో 'హిందవీ ముస్లింలు'గా వ్యవహరించేవారు. భారతీయ ముస్లింలకు, క్రైస్తవులను, వెలుపలి ముస్లిం, క్రైస్తవుల నుండి వేరుగా చూపేందుకు వాడిన 'హిందూముస్లిం' 'హిందూ క్రిష్టియన్'లు తొలినాటి ఆంగ్లేయుల దస్తావేజుల్లో కోకొల్లలు

అయోధ్యలో 16వ శతాబ్దానికి చెందిన మసీదును కూల్చివేసి అక్కడ రామాలయాన్ని నిర్మించదలుచుకున్న హిందూ కార్యకర్తలు జీర్ణం చేసుకోవలసిన సత్యం మరొకటుంది. హిందువుల్లోకూడ రాముణ్ణి దైవంగా భావించనివాళ్ళు, అతని సర్వాధిక్యతను అంగీకరించని వాళ్ళు ఎంతో మంది ఉన్నారు. దేశంలోని కొన్ని ప్రాంతాల్లోనే ( ఉత్తర, పశ్చిమ భాగాలు) రాముణ్ణి దైవంగా ఆరాధిస్తారు. మిగిలిన ప్రాంతాల్లో ( ఉదా.- పశ్చిమ బెంగాల్) రాముణ్ణి దేవుని అవతారంగా కాక, ఇతిహాస నాయకునిగా భావిస్తారు ఇతిహాసంగా రామాయణం దేశం లోపల వెలుపల కూడ ఎంతో ప్రసిద్ధి చెందింది.

అయితే ఇతిహాసంగా రామాయణ ప్రభావాన్ని ఈ దైవత్వ విషయాన్నుండి వేరుచేసి చూడాలి. నిజానికి ఈ ప్రాచీన ఇతిహాసంలో రాముడు దేవుడిగా కాక, త్యాగనిరతుడైన ఒక గొప్ప రాజుగా భావించబడినాడు. ఒక సందర్భంలో జాబాలి అనే పండితుడు రాముణ్ణి ఈ విధంగా ఉపదేశిస్తాడు·

''రామా! వివేకాన్ని ప్రదర్శించు నిత్య సత్యమైన ఈ ప్రపంచం తప్ప మరొక ప్రపంచమేదీ లేదు. వర్తమానాన్ని అనుభవించు అప్రసన్నమైన దాన్ని త్యజించు.''

రవీంద్రనాథ్ ఠాగోర్ కూడ తన విజన్ ఆఫ్ ఇండియన్ హిస్టరీలో ఇతిహాస నాయకుడైన రాముణ్ణి ''కొన్ని ఆదిమ తెగలకు దైవంగా కనిపించిన కారణాన'' ప్రత్యేకంగా శ్లాఘించాడు. బెంగాల్ జానపద నాటకాల్లో కూడా హనుమంతుడు కేవలం ఆహ్లాదాన్ని కలిగించే, ఇష్టుడైన హాస్యపాత్రేకాని, అతనికి ఎటువంటి పవిత్రతా లేదు.

కాబట్టి హిందువులకు, ముస్లింలకు మధ్య ఉన్న మత విభేదాలను హిందూమతంలోని విభేదాలతో, ప్రాంతీయ విభేదాలతో విడదీసి చూడలేము. ఈ భేదాలు ఎన్నికల రాజకీయాలకు కూడ వర్తిస్తాయి. అందుకే హిందూరాజకీయ పార్టీ దేశ ఉత్తర, పశ్చిమ ప్రాంతాలకే పరిమితమయ్యింది. తూర్పు, దక్షిణ ప్రాంతాల్లో దానికి మద్దతు లేదు.

భారత దేశంలో అమలులో ఉన్న లౌకిక విధానంలో ఒక చిక్కు ఉంది. అది వివిధ మతాల సామూహిక అసహన భావాల మొత్తాన్ని ప్రతిఫలిస్తుంది కాని, వారి పరస్పర సహనాన్ని ప్రదర్శించగలిగే శక్తిని కాదు. ఒక పెద్ద మత సమూహానికి ఆగ్రహాన్ని కలిగించే వ్యాఖ్యగాని, చర్యగాని నిషేధార్హమైనదిగా ఇక్కడ భావించబడుతుంది. సాధారణంగా భావప్రకటన స్వేచ్ఛ ఉన్నా ఇక్కడ ఇటువంటి అణచివేతల

సెన్సార్‌షిప్ విధానమే సమస్యాత్మక మౌతుంది. ఉదాహరణకు, సల్మాన్‌రష్దీ 'సాటానిక్ వర్సెస్'ను నిషేధించిన మొట్టమొదటి దేశం భారతదేశం. ఇరాన్ అధికారులు దీన్ని గమనించి ఫత్వాజారీ చేయడానికి ఎంతో ముందే ఇక్కడ ప్రతిస్పందించారు. ఏమతవర్గమైనా తమ మనోభావాలకు విఘాతం కలిగిందని ఆరోపణ చేసినపుడు మన అధికారులు అత్యుత్సాహంగా ప్రతిస్పందించి అణచివేత చర్యలను అమలుచేసిన సందర్భాలనెన్నింటినో ఉదహరించవచ్చును. ఇది ఒక సహనశీల సమాజానికి దోహదం చేయదు.

లౌకికరాజ్యం ఈరెండు మార్గాల్లో దేన్నయినా ఎంచుకోవచ్చును. అయితే, భావ ప్రకటన స్వేచ్ఛను గౌరవించే ఆధునిక సమాజం దైవదూషణ చట్టాలను అన్నిమతాలపై ఉపయోగించే బదులు వాటిని పూర్తిగా పరిహరించడమే మేలని నమ్మేవాళ్ళు తమ అభ్యర్థనను అనురూప్యత కంటే ఇంకా వాస్తవికమైన వాదనలపై ఆధారితం చేయాలి. వీటిగురించి ఆధునిక భారతదేశంలో, ఆధునిక బ్రిటన్‌లోను ఇంకా పూర్తిస్థాయి చర్చ జరగవలసి ఉందని నా ఉద్దేశం.

ఇక్కడి లౌకిక విధానంలోని మరొక సమస్య వివిధమతాల 'పర్సనల్‌లా'కు సంబంధించింది బహుభార్యత్వం హిందువులకు శిక్షార్హం కాగా, ముస్లింలా నలుగురు భార్యలను కలిగి ఉండే వీలును కల్పిస్తుంది (వాస్తవంలో భారతీయ ముస్లింలు దీన్ని వాడుకున్న దాఖలాలు ఎక్కడోకాని కానరావు)

విడాకుల విషయంలో ముస్లింలా వారి స్త్రీలకు హిందూస్త్రీలకున్నంత రక్షణను కల్పించదు. మెజారిటీ మతస్థులయిన హిందువులు ఎలా వివక్షకు గురవుతున్నారో చూపేందుకు హిందూ రాజకీయ వాదులు తరచుదీన్ని ఉదహరిస్తారు. ఇది హాస్యాస్పదం. ఇక్కడ ఉన్న వివక్ష ముస్లిం స్త్రీల పట్ల కాని హిందూ పురుషులపట్ల కాదు. ఇటువంటి హిందూ రాజకీయ ఆరోపణల్లో పురుషాధిక్య దృక్పథం స్పష్టంగా కనిపిస్తుంది. బహుభార్యత్వం వలన హిందువులకంటే ముస్లింల జనాభా పెరుగుదల రేటు అధికంగా ఉంటుందని తరచూ వినవచ్చే ఆరోపణకు్కూడ నిజమైన ఆధారాల్లేవు. అయితే అనురూప్యత అన్నది కూడ ముఖ్యవిషయమే. భారతీయ పౌరచట్టాలు అన్ని మతాల వారికి సమానంగా వర్తించాలని ప్రయత్నించడంలో లౌకికంకానిది కాని, మతవర్గ దృక్పథంకాని ఏమీ లేదు.

నేడు భారతీయ లౌకికవాదం ఎదుర్కొంటున్న సవాళ్ళను నా ఉద్దేశ్యంలో పరస్పర సంబంధమున్న మూడు ధోరణుల క్రింద వర్గీకరించవచ్చు. (1) మత నిరంకుశత్వం (కమ్యునల్‌ఫాసిజం) (2) మతవర్గ జాతీయతా వాదం (సెకేరియన్‌నేషనలిజం) (3) తీవ్రవాద అస్పష్టతావాదం (మిలిటెంట్ అబ్‌స్క్యూరాంటిజమ్)

ఫాసిజం అనే మాటను తరచూ విచక్షణా రహితంగా ఒక 'తిట్టు'గా ఉపయోగిస్తుంటారు. హిందూరాజకీయాలన్నింటిని ఫాసిస్టు ఉద్యమంగా చెప్పటం ఏమాత్రం నా ఉద్దేశ్యం కాదు. అయితే ఫాసిస్టు ఉద్యమాల్లో కనిపించే కొన్ని ప్రత్యేక రాజకీయ లక్షణాలు ఈనాటి కొన్ని తీవ్రవాద హిందూరాజకీయాల్లో నిస్సందేహంగా ఉన్నాయి. హింసప్రయోగం, ఒక మతవర్గ ప్రయోజనాలను సాధించేందుకు ఇచ్చే బెదిరింపులు, ఒక మతానికి చెందినవారిని పీడించడం, ఆవేశపూరితమైన, తీవ్ర విభజనను కలిగించే నినాదాలతో జనాన్ని సమీకరించడం, కొన్ని వర్గాలపై చట్ట విరుద్ధమైన బలప్రయోగాన్ని చేయడం - ఈ లక్షణాలన్ని బొంబాయిలోని తీవ్రవాద హిందూ సంస్థల్లో ఉన్నాయి. వీరు అల్లర్లను సృష్టించడమే కాకుండా ఒక పథకం ప్రకారం ముస్లింలను వధించారు. ఈ వాతావరణాన్ని పొంచి ఉన్న స్వార్థశక్తులు తమ స్వప్రయోజనాలకై వాడుకుంటాయి.

ధృఢ సంకల్పంలేని రాజకీయ పక్షాలు ఈ మూకలను సహించి, వారిని బుజ్జగించేందుకు ప్రయత్నించడంవల్ల ఇవి లబ్ధిపొందుతాయి. బి.జె.పి. స్వతహాగా ఫాసిస్టు పార్టీకాదు కాని శివసేన హింసాత్మక చర్యలను నిర్ద్వందగా ఖండించేందుకు నిరాకరించడమే కాక దానితో పొత్తు పెట్టుకుంది. మితవాద హిందూ నాయకుడైన వాజ్‌పాయ్ శివసేన ఆటవిక చర్యలను ఖండించలేదు. అంతకంటే ముఖ్యంగా హిందూరాజకీయ పార్టీల మతరాజకీయాలనుండి దేశ ఐక్యతను కాపాడడంలోను, సమర్ధవంతమైన నాయకత్వాన్ని అందించడంలోను కాంగ్రెస్ విఫలమైంది.

హిందూ జాతీయతా వాదానికి ఊతమివ్వడం ఈ ఉపఖండంలో కొత్తేమీకాదు. ఆంగ్లేయుల కాలంలో హిందూజాతీయతా వాదానికి ప్రాతినిధ్యం వహించిన హిందూ మహాసభ, ముస్లింలీగ్ ముస్లింల మద్దతు పొందినంతగా, హిందువుల మద్దతును పొందలేదు. స్వాతంత్ర్యానికి పూర్వం, తరువాత కూడ హిందూ మహాసభ పరాజయంపాలైంది. వీరి జాతీయతా వాదాన్ని వారసత్వంగా పొందిన బి.జె పి, హిందూ మహాసభ, జనసంఘ్ పార్టీల్లా కాకుండా విజయాన్ని సాధించింది. ఏదో ఒక రూపంలో హిందూ జాతీయతా వాదమే బి జె.పి రాజకీయాలకు కేంద్రబిందువుగా ఉంది.

పాకిస్తాన్‌ను సాధించేందుకు 'ద్విజాతి సిద్ధాంతాన్ని' ప్రతిపాదించిన కొందరు ముస్లిం నాయకులు ఉపఖండంలోని ముస్లింలు స్థానికులు కారని దూరపశ్చిమం నుండి వచ్చారని వాదించారు చరిత్రతిరిగిన వింత మలుపుచూడండి. ఇప్పుడీ సిద్ధాంతాన్నే ప్రత్యక్షంగానో, పరోక్షంగానో హిందూ ప్రతినిధులు ప్రతిపాదిస్తున్నారు. వాస్తవానికీ సిద్ధాంతంలో నిజంలేదు. ఈ ఉపఖండంలోని ముస్లిం జనాభాలో అత్యధికులు స్థానిక కుటుంబాలవారు, ఇస్లాం మతాన్ని స్వీకరించిన వారే కాని వెలుపలినుండి వచ్చినవారు కాదు. ముస్లింలు పాకిస్తాన్‌కు విధేయులేకాని ఈ దేశానికికాదు అన్న ఆరోపణకు కూడ అసలు ఋజువుల్లేవు. అందుకు భిన్నంగా, అత్యధిక సంఖ్యలో ముస్లింలు పాకిస్తాన్‌కు వెళ్ళేబదులు తాము చెందిన ఈ దేశంలోనే ఉండి పోయారు. దేశభద్రతా దళాల్లో, దౌత్య ఉద్యోగాల్లో, ప్రభుత్వ ఉద్యోగాల్లో ముస్లింలు, హిందువులు, మరి ఇతర మతస్థులంత విధేయతతోనూ ఉంటూవచ్చారు.

హిందూ అతివాదులు ఇటీవలి కాలంలో భారతదేశచరిత్రను పునర్లిఖించే పనిలో నిమగ్నమైనారు. చరిత్రలో ఏమి జరిగిందన్న దాని గురించి పలు కట్టుకథలతో, అసత్యాలతో, ముస్లింలసేవలను తక్కువ చేసి చూపిస్తూ, పాఠశాల పుస్తకాలను సవరించేందుకు వీరు పలు ప్రయత్నాలు చేశారు. దేశంలోని కొన్ని భాగాల్లో మధ్య తరగతి హిందువులకు చరిత్రలో ముస్లిం పాలకులు చేసిన అకృత్యాలగురించి ఆకస్మికంగా జ్ఞానోదయమయిందండీ అందుక్కారణం. కొత్తచారిత్రక సత్యాలు వెలుగులో కొచ్చికాదు, హిందూ కార్యకర్తలు వాస్తవాలను కల్పనలతో జోడించి పుక్కిటి పురాణాల చరిత్రను సృష్టిస్తున్నారు.

గతంలో జరిగిన అకృత్యాలకు పరిహారంగా ముస్లింలు ఈ దేశంలో రెండవతరగతి పౌరులుగా బ్రతకాలన్న వాదన నైతికంగా హాస్యాస్పదమైనదే కాదు, ఇది ఒక చారిత్రక కుతర్కం. కాని శ్రీ అరబిందోవంటి హిందూ మతనాయకులు ముస్లిం పాలన గురించి నిష్పక్షపాతంగా రాశారు.

''విదేశీపాలనగా ముస్లింల పైచేయి త్వరలోనే అంతమయ్యింది. మొగల్‌సామ్రాజ్యం ఒక అద్భుతమైన నిర్మాణం దాని సృష్టిలో, కొనసాగింపులో గొప్ప రాజకీయ చతురత, ప్రతిభ ప్రదర్శించబడినాయి. ఔరంగ జేబు మత దురహంకారం ఉన్నప్పటికీ, ఆ పాలన అద్భుతమైనది, శక్తివంతమైంది, ప్రజలకు ఉపయోగకరమైంది. మధ్యయుగాల సమకాలిక, ఏ ఐరోపాదేశం, సామ్రాజ్యంలో లేని మతస్వేచ్ఛ, సహనం అందులో ఉన్నాయి.''

'ద్విజాతి సిద్ధాంతానికి' భారతీయ సాహిత్యంలో కాని, సంస్కృతిలో కాని ఆధారాలు కానరావు. నేటి మనవారసత్వం ఈ రెంటి ప్రభావంతో ఉద్భవించినదే. ఈ రెంటి ప్రభావం, సాహిత్యం, సంగీతం, చిత్రలేఖనం, వాస్తుశాస్త్రం వంటి అనేక రంగాల్లో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది హిందువుల మతవిశ్వాసాలపై, వారి ఆచారాలపై ఇస్లామిక్ భావాల, విలువల ప్రభావం కనిపిస్తుంది. ఉదా॥ సూఫీ ఆలోచనల ప్రభావం. హిందూ భక్తి కవిత్వంచే అత్యంత ప్రభావితులై దాన్ని తిరిగి పరిపుష్టం చేసిన, జన్మత ముస్లిములైన కబీరు, దాదు అన్ని రకాల హద్దులను అధిగమించారు. కబీరు ఒకచోట ఇలా ప్రకటిస్తాడు

కబీరు అల్లా, రాముల సంతానం
అతను నా గురువు, నాపీర్.

నిజానికి ఇన్ని సంవత్సరాల ఉనికి అనంతరం ఇస్లాం మతాన్ని, పారసీల, సిరియన్ క్రైస్తవుల మతాల్లా ఒక భారతీయ మతంగా గ్రహించాలి. హిందూ, బౌద్ధమతాలు భారతదేశంనుండి, దక్షిణ, తూర్పు ఆసియా ప్రాంతంలో వ్యాపించాయన్నది అందరికీ తెలిసిందే. అదేవిధంగా ఇస్లాం మతం భారత దేశం నుండి ఇప్పటి ఇండోనేషియా, మలేషియాల్లో వ్యాప్తి చెందింది.

హిందూ జాతీయతా వాదాన్ని నిలిపి ఉంచాలంటే, భారతీయ ముస్లింల భారతీయతను తక్కువ చేసి చూపాలి. కాని దీనికి ఎలాంటి, జాతి, రాజకీయ, చారిత్రక, సాంస్కృతిక పరమైన హేతుబద్ధ ఆధారాల్లేవు.

లౌకికతత్త్వం ఎదుర్కొంటున్న మూడవ సవాలు తీవ్రవాద అస్పష్టతా వాదం ప్రజల అమాయకత్వాన్ని అసరాగా చేసుకుని రాజకీయ ప్రయోజనాలను సాధించేందుకు, తర్కానికి నిలువని, కాలంచెల్లిన అస్పష్ట సిద్ధాంతాలతో తీవ్రవాదాన్ని రెచ్చగొడతారు.

ఖచ్చితంగా మసీదు నిలిచిన స్థానంలోనే రాముడి ఆలయం ఉండేదని, దాన్ని ఒక మొగల్ చక్రవర్తి కూల్చివేశాడని, భగవంతుని అవతారమైన రాముడు ఐదువేల సంవత్సరాల క్రితం అదే స్థానంలో జన్మించాడని ఏ చారిత్రక ఋజువుల్లేని తమ నాయకుల ప్రతిపాదనలను అయోధ్యలో గుమిగూడిన వందల, వేలమంది హిందువుల విశ్వశించి మసీదును కూల్చి వేయడం సబబేనని నమ్మారు.

కనిష్ఠ స్థాయిలో ఉన్న అక్షరాస్యత ఇటువంటి అజ్ఞానాన్ని ఇంకా పెంచి పోషిస్తుంది. ఇప్పటికీ దేశంలో అక్షరాస్యత శాతం 52. ఇది 'హిందీ బెల్ట్'గా వ్యవహరింపబడే ప్రాంతంలో ఇంకా తక్కువ స్థాయిలో ఉంది. అయోధ్య ఉద్యమకారుల్లో ఎక్కువమంది, ఉత్తర ప్రదేశ్, మధ్యప్రదేశ్, రాజస్థాన్ రాష్ట్రాలనుండి వచ్చినవారే. నిరక్షరాస్యత కమ్యునల్ ఫాసిజంకు, మతవర్గ జాతీయతా వాదానికి ఊతాన్నిస్తుంది.

అస్పష్టతావాదం భారత దేశానికి కొత్తేమీకాదు గాంధీ , టాగోర్, నెహ్రూ దీన్ని గురించి విస్తృతంగా రాశారు. ఆసక్తికరంగా ఇటువంటి పరిణామానికి మనకు ప్రాచీన ఉదాహరణ 11వ శతాబ్దానికి చెందిన అరబ్బు గణిత కారుడు, శాస్త్రవేత్త అల్-బరూని రచనల్లో కనిపిస్తుంది. మొదట జనీమహమ్మదుతోపాటు భారతదేశానికి వచ్చిన ఇతను బహుశా బి.జె.పి. వాళ్ళు కూడ మెచ్చుకునే విధంగా గజనీమహమ్మదు దండయాత్రలను గురించి రాశాడు: ''మహమ్మదు దేశసౌభాగ్యాన్ని పూర్తిగా కాలరాశాడు. వారి దాడుల్లో హిందువులు ధూళిరేణువుల్లా అన్ని దిక్కులకు చెల్లా చెదురయ్యారు.

చెల్లాచెదురైన వారి అస్థికలు మహమ్మదీయులందరి పట్ల తీవ్రమైన ఏవగింపును కలిగించాయి.''
ఇటువంటి వాతావరణంకూడ అల్బరూని సంస్కృతాన్ని నేర్చుకుని, ఎందరో హిందువుల సహకారంతో గణితం, తత్త్వశాస్త్రం, ఖగోళశాస్త్రం, వాస్తుశాస్త్రం, మతగ్రంథాలను అధ్యయనం చేసేందుకు ఆటంకం కాలేదు.

హిందూ మతంలో ఉన్నతస్థాయిల్లో విగ్రహారాధన ఎందుకు లేదన్న దానిక్కూడ అల్బరూని సూక్ష్మ వివరణను ఇచ్చి ఉన్నాడు. హిందువులు ఎప్పుడూ కూడ ఏదైవానికి కాని, చివరకు ఏ మానవాతీత శక్తికి సంబంధించిన విగ్రహాన్ని కూడ రూపొందించలేదు. కాని ఈ విగ్రహాలు జ్ఞానం లేని సామాన్యుల కొరకు రూపొందించబడినాయి. పురోహిత వర్గం అన్ని రకాల జిత్తులతో, మాయోపాయాలతో క్రింది తరగతులవారిని వశం చేసుకుని వాళ్ళను 'బానిసత్వం' లో ఉంచారు. శాస్త్ర జ్ఞానానికి దూరంగా ఉంచబడిన ఈ క్రింది కులాలవారి విశ్వాసాలు వింతగా ఉండేవని కూడా అల్బరూని రాశాడు.

ఇటీవల అయోధ్యలో గుమిగూడినగుంపు ఇటువంటి 'బానిసత్వం' లోనే ఉంచబడ్డారు మతాన్ని రాజకీయ ప్రయోజనాకు వాడుకునే క్రియాశీలక రాజకీయ సాధువులు, రాజకీయనాయకుల టక్కరి జిత్తులు వీరికి అనుభవమై ఉంటాయి అయోధ్య ఉద్యమానికి ప్రజలను సమీకరించేందుకు నిరక్షరాస్యత రాజకీయ నాయకులకు ఉపయోగపడింది.

మరి ఇప్పుడు భారతదేశంలో లౌకికవాదాన్ని కాపాడేందుకు ఏంచేయాలి? హిందూ జాతీయతా వాదంలోని భిన్న పార్శ్వాలను భిన్న రీతుల్లో ఎదుర్కోవాలి ప్రజల, ప్రభుత్వపు దృఢ సంకల్పంతో మాత్రమే కమ్యునల్‌ఫాసిజంను ఎదుర్కోనడం సాధ్యం. రాజకీయ నాయకులు శివసేన వంటి పార్టీలను బుజ్జగించడం మానాలి బాధ్యతగల రాజకీయ నాయకులు ప్రజాభిప్రాయాన్ని రూపొందించేబదులు, ప్రజాభిప్రాయం మారేవరకు వేచి చూడడం దారుణం. బాధ్యతగల అధికారులు పాలన సాగించేబదులు, పలాయనం చేసినపుడు ఎటువంటి దారుణమైన సంఘటనలు జరుగుతాయనే దానికి బొంబాయి సంఘటనలు ఒకగుణపాఠం. ఇప్పటికిప్పుడు ఇది 'శాంతి భద్రతల' సమస్యేకాని, దీర్ఘకాలంలో శివసేన వంటి సమూహాల సిద్ధాంతాలను ఎదుర్కోనవలసిన అవసరం ఉంది. ఇలా చేయడంలో భిన్నత్వాన్ని సహించిన భారతీయ పరంపరను నొక్కి చెప్పాలి.

శివసేనకు ఆదర్శప్రాయుడైన శివాజీకూడ ఇతరమతాల పట్ల ఎంతో సహనాన్ని కలిగి ఉండేవాడు. శివాజీ ఔరంగజేబ్‌కు రాసినట్లుగా చెప్పబడుతున్న ఒకలేఖ ఔరంగజేబు పరమతద్వేషాన్ని ఎత్తి చూపుతుంది. ''జహాపనా! పవిత్రగ్రంథాలని పిలువబడేవాటి పట్ల అసలు మీకే మాత్రం విశ్వాసముంటే, అక్కడ మీకు భగవంతుడు సర్వమానవాళికి భగవంతుడని కేవలం మహమ్మదీయులకు మాత్రమే కాదని బోధపడుతుంది. అల్లా సమక్షంలో మహమ్మదీయుడైనా, మతహీనుడైనా ఒక్కటే. హిందువుల నుండి మీరు కోరుతున్న కప్పం న్యాయ విరుద్ధమైనది''.

మిలిటెంట్ అబ్స్కూరాంటిజంను ఎదుర్కోనేటప్పుడు, విద్యావ్యాప్తితో పాటు, బోధిస్తున్న విషయం పట్లకూడ దృష్టిని సారించాలి. ఇటీవలి కాలంలో చరిత్రను ఉద్దేశ్యపూర్వకంగా వక్రీకరిస్తూ, మితిమీరిన దేశభక్తిని, జింగో ఇజంను పెంచి పోషిస్తూ విద్యాబోధన సాగుతున్నది. బి.జె.పి. రాజకీయంగా బలంగా ఉన్న ఉత్తరాది రాష్ట్రాలలో ఈ సమస్య తీవ్రస్థాయిలో ఉంది. అక్కడ పాఠశాల పుస్తకాలను పలుమార్లు సవరించారు.

హిందూ జాతీయతావాదానికి సంబంధించి రెండు వర్గాలున్నాయి. మొదటిది స్వల్పసంఖ్యలో ఉన్న కరుడుగట్టిన వర్గం. రెండవది ఈ వాదంపట్ల పెద్ద సంఖ్యలో పాక్షికంగా ఆకర్షితులైన వారివర్గం మొదటి వర్గం కొత్తది కాదు. ఈ వర్గ సభ్యుడే 45 సంవత్సరాలక్రితం మహాత్మాగాంధీని బలిగొన్నాడు రెండవది ఒక పద్ధతి ప్రకారం భారతదేశ చరిత్ర, సంస్కృతులకు సంబంధించి జరిగిన వక్రీకరణల కారణంగా ఈ వాదం పట్ల ఆకర్షితులైన వారి వర్గం. తగిన విధంగా ఈ చారిత్రక వక్రీకరణలను సవాలుచేయకపోవడం వల్ల వీరి వ్యూహం ఫలించింది.

ఈ హిందూ రాజకీయవాదులు ఒడుపుగా పనిసాధించేందుకు - అయోధ్య మసీదు గురించి, భారతీయ ముస్లింల పుట్టుకగురించి, ఎన్నోరకాల భిన్నత్వాలను తనలో ఇముడ్చుకొనగల హిందూమత శక్తిని గురించి పూర్తిస్థాయి అజ్ఞానంపై ఆధారపడడమేకాక, భారతీయ నాగరికత సాధించిన ప్రముఖ విజయాలను విస్మరించారు.

ఉపనిషత్తులు, గీతలలోని సూక్ష్మతకాని, ధామగుప్త, శంకరాచార్య, కాళిదాసు, సూద్రకుడు మొ॥వారి సూక్ష్మతకాని వీరికవసరం లేదు. రాముడి విగ్రహం, హనుమంతుని ప్రతిమల ఆరాధనే వీరి క్కావాలి. బీజగణితం, రేఖాగణితం, ఖగోళశాస్త్రం వంటి వాటిలో ముందంజ వేసిన ఈ దేశపు హేతువాద సంప్రదాయంకూడ వీరి కఖ్ఖర లేదు. ఇక్కడే దశాంశ పద్ధతి పుట్టింది ఇక్కడే తత్త్వశాస్త్రం గొప్ప సూక్ష్మతను సాధించింది. ఇక్కడి ప్రజలే చదరంగం వంటి ఆటను కనుగొన్నారు సెక్సువిద్య, ఒక పద్ధతి ప్రకారం రాజకీయ అర్థశాస్త్ర అధ్యయనం ఇక్కడనే మొదలయ్యాయి ఏదో విధంగా ఈ దేశాన్ని తిరుగులేని విగ్రహారాధకుల, పూనకం పట్టిన మత మౌఢ్యాల, యుద్ధోన్మాదులైన దైవభక్తుల, మతహంతకుల దేశంగా చూపాలని హిందూవాది సంకల్పం. జేమ్స్ మిల్ వంటి సామ్రాజ్యవాద చరిత్రకారులు భారతదేశాన్ని గురించి ఈ విధంగానే భావించారు. మేధోపరంగా దివాళతీసిన, క్రూరవిధానాలు, ఆటవిక సాంఘిక ఆచారాలతో నిండిన దేశంగా భారతదేశాన్ని చిత్రించాడు. గతంలో భారతజాతీయవాదులు ఈ వాదాన్ని తిప్పికొట్టారు. నేటి హిందూ జాతీయవాదులు ఈ అభి ప్రాయం నిజమని నిరూపించేందుకు కంకణం కట్టుకున్నారు.

లౌకిక తత్త్వ వ్యతిరేక శక్తులే నేడు రాజ్యమేలుతున్నాయి. అయితే వారి శక్తికి పరిమితులున్నాయి. ఇంత జరిగినా, ఇప్పటికీ మెజారిటీ హిందువులు, ముస్లింలు వీరి సిద్ధాంతాలను వ్యతిరేకిస్తున్నారు. ఈ శక్తులు భారతదేశంలో ఉన్న ఒక్క మత భిన్నత్వాన్ని మాత్రమే ఉపయోగించుకునేందుకు ప్రయత్నిస్తుండగా, మిగిలిన జాతీయ విభేదాలు, పరంపరలు, భిన్నదిశలకు లాగుతున్నాయి. ప్రాంతీయ విభేదాలు, ఏది పవిత్రం, ఏదికాదు అన్న దాని గురించి హిందూమతంలోని భిన్నరూపాల్లో ఉన్న తేడాలు, భారతదేశ చరిత్రను వ్యాఖ్యానించడంలో సామాజిక, ప్రాంతీయ తేడాలు, ఉద్దేశపూర్వకంగా చేస్తున్న చరిత్ర వక్రీకరణలకు ఎదురవుతున్న వ్యతిరేకత వీరి అంతిమ ప్రభావానికున్న పరిమితులు. అంతేకాదు, భారతీయ హేతువాద పరంపరకు దానిదైన స్థానం ఉంది. మతోన్మాదాన్ని రెచ్చగొట్టి దీన్ని తుడిచివెయ్యడం సులభంకాదు. క్రింది కులాలవారి సమస్యలు హిందూ రాజకీయ వాదులు కాంక్షిస్తున్న దానికంటే భిన్నమైన రాజకీయ పెనుగులాటకు దారితీస్తాయి. అన్నింటికంటే ముఖ్యంగా, అనేక స్థాయిల్లో అజ్ఞానంపై ఆధారపడటం వీరి అతి పెద్ద బలహీనత. ఇదే ఈ లౌకికతత్త్వ వ్యతిరేక శక్తుల గొలుసులో అతి బలహీనమైన లంకె. ఇక్కడే ముఖాముఖి పోరాటం మిగిలి వుంది.

(అమర్త్యసేన్ వ్యాసం, The Threat to Secularism, New York Review of books, April, 1993 ఆధారంగా)



''ఎక్స్కవేషన్'' ఆయిల్స్ & అక్రిలిక్ కలర్ (1966)